ఓం
శుభమస్తు.
శ్రీగణేశాయనమః
వాణ్యైనమః

## గురు ప్రార్థన.

గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణు । గురుర్ దేవో మహేశ్వరః
గురుర్ సాక్షాత్ పరంబ్రహ్మ । తస్మైశ్రీ గురవేనమః॥

తా॥ గురువు, బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపమనియు, సాక్షాత్తు పరమాత్మయే యనియు అజ్ఞానాంధకారము పోగొట్టు నట్టియు గురుదేవునకు నమస్కారము.

## భగవత్ ప్రార్థన.

శ్రీమద్భాను సహస్రమండల విభాసీ సచ్చిదానందమూర్తీ
మాయాపరికల్పితాఖిల జగచ్ఛ్రేణీ దయాంభోనిధీ
స్వామీ నీమహిమంబు లా నిగమముల్ వర్ణింపలేమన్న చో
నే మూఢాత్ముడ నేమెఱుంగుదును తండ్రీ భక్తచింతామణీ !

తా॥ కోటిసూర్యప్రకాశమాన మగునట్టియు, సత్యజ్ఞానానంద స్వరూపుడవును, నీ మాయద్వారా జగత్తును లీలగా నిర్మించినట్టియు, దయాసముద్రడవైన పరమేశ్వరా నీమహిమంబు లా వేదములు వర్ణింపలేమనుచుండ మూఢుడనగు నేనెట్లు గ్రహింపగలను?

శ్రీరామా రఘునందనా రఘుపతీ సీతామనోనాయకా
కారుణ్యాభయదానహస్తవరదా కాకుత్సవంశోద్భవా
దారిద్ర్యాంధతమిస్రతాపహరణా తత్వాబ్ధి చంద్రోదయా
రారా నామదిలో వసించి కృపతో రక్షింపరా మ్రొక్కెదన్.

తా॥ ఓ రఘువంశాధిపతివగు శ్రీరామా! సీతాదేవియొక్క మనస్సున కధిపతివగునట్టియు, కరుణతో భయపడువారల కభయహస్త మొసంగునట్టియు, దరిద్రమను చీకటిని పోగొట్టుచు తత్వమను సముద్రమునకు చంద్రోదయమువలె నామనంబున కృపతో వసింపుము, నీకు నమస్కరించెదను.

## ప్రశ్లోదవాక్యము.

ఇందుగల డందులేదని
సందేహామువలదు చక్రి
సర్వోపగతుం డెందెందు వెదకిచూచిన
అందందే కలడు దానవాగ్రణివింటే.
చిక్కడు వ్రతముల క్రతువుల
చిక్కడు దానముల శౌచశీల తపములన్
చిక్కడు యుక్తిని భక్తిని
చిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ. ॥భాగ॥

తా॥ పరమేశ్వరుడు ఒకచోటనుండి ఒకచోట లేకపోలేదు. ఎచ్చటెచ్చట వెదకిన నచ్చటచ్చటనేయుండును.

వ్రతములచేతను, క్రతువులచేతను, దానశౌచతపంబులచేతను మెప్పింపజాలరు. ఉపాయముచేతను, భక్తిచేతను లభ్యుడగును.

నీపాద కమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును
నితాంతాపార భూతదయయును
తాపసమందార నాకు దయసేయగదే. (భాగ)

తా॥ భగవంతుని పాదసేవయు, భక్తులతో స్నేహమును, అపరిమితమగు భూతదయయును తపోనిష్ఠులకు మందారమువంటి ఓ పరమేశ్వరా! మాపై ననుగ్రహింపుము.

## భక్తునిస్తుతి.

నీతోనవ్వులు, నర్మగర్భితములున్ నీతోడ సల్లాపముల్
నీతో ముద్దులు ముచ్చటల్ మురిపెముల్ నీతోడ విజ్ఞాపముల్
నీతో నాటలుపాటలేకతములున్ నీతో జగంబంతయున్
నీతోనేసుమి నీదుభక్తునకు తండ్రీ భక్తచింతామణీ.

తా॥ భక్తునకు నవ్వులు, రహస్యములు, హాస్యములు, ముద్దు ముచ్చటలు, విన్నపములు, ఆటపాటలు జగంబంతయు వేయేల సర్వము భగవంతునితోడనే యను దృష్టిలో యుండును.

ఆరంభంబులకెల్ల జీవము మహాత్మా నీవకావే భవ
త్కారుణ్యామృతవృష్టినొందు ఫలముల్ కార్యంబులే నీవయిన్
భారంబంతయువైచి పౌరుషము యావచ్ఛక్తిగావింత్రు ప్రా
పై రక్షింపవె సత్ప్రయత్నముల దేవా భక్తచింతామణీ!

తా॥ భక్తజనుల కోరికలిచ్చువట్టి దేవతామూర్తీ! ప్రతి కార్యారంభమునకు జీవము పరమేశ్వరుడవగు నీవే కావున నీయొక్క కరుణామృతముచే వృద్ధిపొందు ఫలమును కార్యభారంబులును నీవయి నుంచి నాయావచ్ఛక్తి నుపయోగించి ప్రయత్నింతు. నా యందనుండి సత్ప్రయత్నముల నెరవేర్చుము.

---

## ఒక్క మనవి.

ఈగ్రంథము వేదాంతులకేగాని ఉపయోగములేదని భావింప వలదని మనవిచేయుచున్నాను. ప్రతియొక్కరు నిత్యజీవితము సుఖదాయకముగ గడుపుట కవసరమగు నూతనమార్గమున వ్రాయబడినది. కేవల వైరాగ్యముతో అన్నియు వదలిపోవుటకన్న కర్మలుచేయుటలో నేర్పరితనము గ్రహించి అందరితో కలసిమెలసి సంచరించుట కనువగు విషయములే నూతనమార్గమని నామనవి. తోడిసోదరసోదరీమణులను ఆత్మస్వరూపులుగనెంచి సేవయొనర్చు ఉద్దేశ్యముతో, ఉడుతాభక్తి వలె గ్రంథరచనయను మహాకార్యమునకు గడంగితిని. శబ్దార్థదోషము లుండిన తెలియపరచినచో ద్వితీయముద్రణమున సవరింపబడును.

తణుకు,
15—3—1958.

ఇట్లు,
రాళ్ళభండి రత్నమ్మ.

ఓం

శ్రీ పరమగురుభ్యోనమః

# పీఠిక.

---

శ్రీ సద్గురువులగు రాచకొండ నరశింహాశర్మగారి పరిపూర్ణ కటాక్షముచేతను, మహనీయుల ఆశీర్వచనప్రభావముచేతను, నాచే రచింపడిన ఈ గురుశిష్యప్రబోధమను గ్రంథమందు గురుశిష్యులకుండ వలసిన లక్షణములు, సృష్టినిర్మాణకారణము, స్థితి, లయము మొదలగు విషయములు, జీవులకు సృష్టియొక్క ప్రయోజనములు వ్రాయబడినవి. పశుత్వమునుండి మానవత్వమునకు, మానవత్వమునుండి దేవత్వమునకు, దేవత్వమునుండి దివ్యత్వమునకు అనగా మోక్షోపాయములగు జ్ఞాన, కర్మ, భక్తియోగములను అనుష్ఠించు విధానము వ్రాయడమైనది. ఇందు భక్తిమార్గమే సర్వశ్రేష్ఠమగునదియనికూడ నిర్ణయము. ఏలననగా గిన్నెలు, బియ్యము మొదలగునవి ఎన్నియున్నను నీరులేనిచో పాకముచేయుట కెట్లవకాశములేదో మోక్షమార్గములగు జ్ఞాన, కర్మ, భక్తియోగములన్నిటిలో భక్తి నీరువంటిది. కావున భక్తిలేక ఏమార్గమూ అంత సుగమము కాజాలదని అభిప్రాయము. పైనుదహరించిన మార్గములన్నియు మోక్షోపాయములే. ఏ ఒకమార్గమనుసరించినా మిగిలినవికూడ ప్రయత్నించిన వచ్చి చేరును. భక్తియన హృదయమృదుత్వము, సర్వభూతములయందు మృదుభావముతో కూడిన భగవద్భావన కావలయునని దీనిభావము. మోక్షముపొందుట యనగా జీవాత్మ అవిద్యనుండి విముక్తుడై ఆత్మస్వాతంత్ర్యమును పొందుట. పొందినపిమ్మట విషయమగు మోక్షమన నేమియో తిరిగి మానవలోకమునకు వత్తురా? వచ్చిన వారిస్థితి ఎట్లుండును? మోక్షస్థితినిపొందిన బ్రహ్మ, విష్ణు మహేశ్వరాదులుకూడ ఇంకను నిష్ఠచేయుచునే యున్నారే ఏల, ఎందుకొఱకు చేయుచున్నారు అను విషయములుకూడ ఇందు పొందుపరుపబడినవి.

ఇంకను బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములను నాలుగు ఆశ్రమముల నిర్ణయము, స్త్రీల ధర్మములు, పురుషులు స్త్రీల యెడల చూపవలసిన ధర్మములుకూడ వ్రాయఁబడినవి. ముక్తులయిన వారు లోకమున వ్యవహరించవలసిన విషయములు జిజ్ఞాసులకు కలుగు అనేకసందేహములకు ప్రశ్నోత్తరరూపములుగ పొందుపరుపబడినవి. ఈగ్రంథమునందు భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు ఆధారముగను భాగవతాది భక్తుల అనుష్ఠానములను కలిపివ్రాయడమైనది.

కావున స్త్రీపురుషులెల్లరును బాలురును అందరు చదివి భక్తి జ్ఞానములతోకూడిన కర్మవీరులై దేహముచేత కర్మచేయుచు సోమరి తనమును దూరమొనర్చుకొనుచు హృదయమున భక్తియను మృదు భావముతోకూడిన సర్వజీవ ప్రేమకలవారై దేశోద్ధారకులై సర్వము పరమేశ్వర స్వరూపమనే జ్ఞానముచే కలుగుపరమశాంతియను మోక్ష మనుభవించుచు, విశ్వదృష్టితో విశాలభావముతో లోకకళ్యాణ కర్మల నాచరింపవలయునని చదువరులెల్లరను ప్రార్థించుచున్నాను.

అసలు ప్రతిజీవికి పుట్టుకతోనే ప్రపంచముతో అనగా ప్రకృతి తోను, పుట్టిన వంశముతోను జాతివృత్తులతోను సంబంధమేర్పడు చున్నది. ప్రకృతియన నేమి? ఇది న్యాయముగా సర్వము చేయు చున్నదా? దేనివల్ల జడపదార్థము నడుచుచున్నది. ఎంతో తెలివిగల దానిచే బహునేర్పరితనముగా నియమింపబడుచున్నట్లున్నదే. మనము ఎవరము? మనకు ప్రపంచకమునకెంతవరకు సంబంధము? మనకు జగన్ని యంతయైన పరమేశ్వరునకు ఎంతసంబంధము? మనము చేయవలసిన కర్తవ్యమేమి? ఏదో తినుట, త్రాగుట, కోరికలు తీర్చుకొనుట, ధన మార్జించుటయేనా? కాదు. సృష్టివలన పరమప్రయోజనముగలదు. నిష్ప్రయోజనముగ సృష్టియందలి ఏపదార్థము నిర్మింపబడలేదు. ఈ సృష్టివల్ల భగవంతునకేమియు అవసరములేదు. జీవరాసుల ప్రయోజ

నముకొఱకే రచింపబడి కూర్పబడినది ఈప్రపంచము. దీనివల్ల ధర్మ, అర్ధ, కామ, మోక్షములను పొందుటకే ప్రతిజీవియు ప్రయత్నించవలెను. మోక్షమునొందియు ఊరకుండక ఇతరులను ధర్మప్రవర్తనయందు యుంచుటకే ప్రయత్నించవలెను. ఏదైనను ఏదో యొకపని చేయక ఎవరికితప్పుటలేదు. కాని దానిని కొంతమందిదృష్టి కేవల ప్రకృతిమీాదయుండుటచే వారికర్మ ప్రకృతివరకే చెందుచున్నది. కొందరిదృష్టి నేను, నావరకె ఏపుణ్యాకార్యమయినానసరే దానిఫలము నేను, నావరకే చెందుచున్నది. ఈభావములన్నియు దూరమొనర్చి కర్మఫలము ఈశ్వరార్పణము చేసినయడల మోక్షమునొందుటయే గాక భగవంతునిలోని శక్తిసామర్థ్యములుకూడ కొంతవరకు మానవులకు లభించును. స్వార్థపరత్వమువీడి భావవిశాలత్వమేర్పడినవారొనర్చు కర్మలచే, తనకు,గృహమందలివారికి, దేశమునకుకూడ మేలుకూర్చును. ఇదియే గీతామాతయొక్క కర్మలనొనర్చుట కొసంగిన ఆదేశము.

తణుకు,<br>
15—3—1958.

ఇట్లు,<br>
రాళ్లభండి రత్నమ్మ.



శ్రీ భగవానుని కరుణాకటాక్షముపొంది తాను తరించి ఇతరులనుగూడ తరింపజేయుటకు భక్తియోగము సర్వోత్కృష్టసాధనము. అట్టి అవిచ్ఛిన్నభక్తితో పరమేశ్వరు నారాధించి తరించినవారు ఎందరెందరో మహానుభావులు మన భారతదేశమునందవతరించి తమతమ దివ్యసందేశములను గ్రంథరూపముగా రచించి లోకశ్రేయమునకు తమ జీవితముల నంకితముచేసియున్నారు. అట్టి మహాత్ములయొక్కయు మహర్షులయొక్కయు దివ్యసందేశములసారము అనుభవపూర్వకముగా భగవత్కటాక్షముచేతను సద్గురు కటాక్షముచేత గ్రహించి ఆస్తిక మతావలంబులైన స్త్రీపురుషాదులకు సుగమరీతి తెలియునట్లు ఎన్నియో అమూల్యవిషయముల ఉపనిషత్తులు, భగవద్గీత మొదలగు వానినుండి సేకరించి గురుశిష్యుల సమాధాన ప్రశ్నలరూపముగా చక్కగా సప్రమాణముగా సందియములకు తావులేకుండ శ్రీమతి రాళ్లభండి రత్తమ్మ గారు వివరించి యీగ్రంథము వ్రాసిరి. ఆసక్తి, భగవచ్చింతనయందు కలిగించుటకు సహజముగా భగవత్తత్త్వమునందాసక్తి కలవారికి ఇంకను ఆధ్యాత్మికోన్నతి కలిగించుటకు ఈగ్రంథము ఎంతయేని సహాకరించును. ఈ గ్రంథరచన వీరికిది ప్రథమప్రయత్నమైనను ఇందలి విషయములబట్టి చూడ ఈగ్రంథకర్త్రిగారు చిరకాలసాధనముచేతను భగవత్కటాక్షముచేతను, అనుభవ విశేషము సంపాదించినట్లు స్పష్టమగుచున్నది. పాఠకమహాశయులిందలి అమూల్యవిషయముల గ్రహించి ఆచరించి భగవత్కటాక్షముపొంది తమ శ్రేయముతోగూడ లోకకల్యాణమును కూడ సాధింతురుకావుత.

తణుకు,
15—3—1958.

గోనెళ్ల రామమూర్తిశాస్త్రి.
*గాయకశిరోమణి. ఉభయభాషాప్రవీణ.*
P. O. L.

ఓం.

శ్రీ పరమగురుభ్యోన్నమః

# గు రు శి ష్య ప్ర బో ధ ము

## ప్ర థ మ భా గ ము.

ఒక పుణ్యానదీతీరమందున్న తరుసమీపమున నొక యోగి పుంగవుండు సమాధినుండి లేచి భగవంతుని దివ్యశక్తులనుగూర్చి వర్ణించు నవసరంబున నొక జిజ్ఞాసువువచ్చి అమ్మహాత్ముని దర్శించి "హేదయా మయా! మిమ్ములను కనుంగొనిన నాకెంతయేని ఆనందముప్పొంగు చున్నది. నా సందేహముల దీర్పగలకను విశ్వాసము జనించిది. మీరే నా గురువరేణ్యులని నిశ్చయించుకొంటిని" అని విన్నవించెను. అంత నమ్మహాత్ముడు అనుగ్రహించి "నాయనా! నీ సందేహములదీర్చెదను" మని అనుజ్ఞ నొసంగెను.

శిష్యుడు: హేప్రభూ! గురువున కుండవలసిన ముఖ్యలక్షణము లెరింగింప వేడెద.

గురువు: గురువు సత్కర్మపరాయణుండును, అనుభవ జ్ఞానియు, శిష్యులకు బోధించి సందేహముల దీర్పసమర్థతకలవాడును, దయార్ద్ర హృదయుడును, శిష్యులయెడ అమితవాత్సల్యము గలవాడును, శిష్యుడు కృతార్థుడు కావలెనని కపటములేక విద్యబోధించువాడును, పరకాంతా పరధనాపేక్ష లేనివాడును మరియు ఎట్టి దుష్ప్రవర్తనకు లోబడనివాడును అగు వానినే గురువుగా స్వీకరింపవలయును.

శి: గురువర్యా! శిష్యునకుండవలసిన ముఖ్యలక్షణము లెట్టివి?

గు: అనుభవశాలియైన గురుని జేరి వినమ్రుడై వినయవిధేయతలతో ప్రశ్నించి తాను తెలియదగిన విషయము తెలిసికొనవలయును.

విశ్వాసముతో గురువునందమితభక్తిగలిగి గురువాక్యమునందు నమ్మికతో ఆచరణీయుడుగను, గురుకటాక్షమును పొందుటకు తగిన యోగ్యుడుగను, సత్యము, అహింస మొదలగు దివ్యగుణము లతోఁగూడినవాడుగను మరియు గురుఋణముతీర్ప సమర్థుడుగా నుండవలెను.

శి: స్వామీ! గురుఋణము నెట్లు తీర్పవలెను?

గు: వత్సా! గురుఋణము తీర్చుట యన తను, మన, ధనముల నర్పింప వలెను. అనగా తన దేహమును గురువాక్యప్రకారము నియ మించుచు ధ్యానమందు దేహమును మరచుచున్నాడు గావున దేహ మిచ్చినవాడగును. మనస్సును గురువుచే నెరింగిన లక్ష్యమందునిల్చి అమనస్కుడగుటచే మనస్సు నొసంగినవాడగును. జ్ఞానధనముచే విజ్ఞానముపొందుచున్నాడు గావున ధనము నర్పించినవాడగును. ఇంకను శిష్యుడు గురువంతటి అనుభవనీయుడు ఐనప్పుడే గురు ఋణము తీరును. కాని భౌతికవస్తువుల నొసంగినంతమాత్రమున తీరదు.

శి: దేహములు నిర్మింపబడుటకు కారణమేమి?

గు: ప్రళయమందు సృష్టిలేక ప్రకృతి పరమాణువులై యుండును. సర్వ వ్యాపకమగు పరమాత్మయందే కొన్ని చేతన, కొన్ని అచేతన అణువులు స్వతసిద్ధముగా నుండును. చేతన అణువులు జీవులన బడును. ఇవి అగణితములై యున్నవి. అచేతన అణువులు సృష్టి కాలమున జగద్రూపముగా గోచరించును. ప్రళయమందు సూక్ష్మ ముగనుండి సృష్టియందు జగద్రూపమగుచు, పరిణామము నొందు టచే నియ్యది మాయ యనియు, పరిణామినియనియు చెప్పబడును.

మరియు జీవాత్మలు ప్రళయమందు పరమాత్మయందే యున్నను ప్రకృతివినోదమునుకోరి పరమాత్మ నిట్లు ప్రార్థింతురు.

హే ప్రభూ! నీ నామస్మరణచేయు వాక్కును, నిన్నుదర్శించు దివ్య నేత్రములును, నీ స్తోత్రములువిను చెవులును, నీయందే నిల్చు మనస్సును కలమంచి దేహములను నిర్మించి మమ్ములను అనుగ్రహింపుము. మేము పూర్వపాపములచే తపించుచున్నాము. ఎట్టినీచ కార్యములుచేయము అని వేడుటవలన పరమాత్మ దయామయుడు గావున యథాప్రకారముగ వేదములను మరియు తనయందు అవ్యక్తముగానున్న ప్రకృతిని యీవిధముగ నిర్మించెను.

శి: స్వామీ! మొదట ప్రకృతిస్వరూపమును మరియు లక్షణములను ఎరిగింపవేడెద.

గు: ప్రకృతి సాకారము జడము మరియు అనాదియునై యున్నది. ఇక సృష్టిక్రమము నెరింగించెద.

ఓం ఋతంచసత్యం చా భీద్ధాత్తప సోఽధ్యజాయత
తతోరాత్ర్యజాయత తతఃసముద్రో అర్ణవః
సముద్రా దర్ణవాదధి సంవత్సరో అజాయత
అహోరాత్రాణి విదధత్ విశ్వస్యమిషతోవశీ
సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వమకల్పయత్
దివంచపృథ్వీం చాంతరిక్షమథోస్వః

ఋ॥ అ ౧॥ మ ౪౮.

## అర్థము.

తనయందు అవ్యక్తముగానుండు కారణప్రకృతిచే వ్యక్తరూపమగు స్థూలసూక్ష్మరూపమగు కార్యప్రకృతిని సృష్టించెను. తర్వాత దానినుండి రాత్రి కలిగెను. దానిచే సముద్రజలమయ్యెను. దానికి పిదప సంవత్సరమేర్పడెను. తర్వాత నిమేషోన్మేషలక్షణలక్షితమగు జగమును, తనవశమందుంచుకొని, పరిపోషించు పరమాత్మ రాత్రిం దివముల విధాన మొనరించుచు, పూర్వమువలెనే సూర్యచంద్రులను

ద్యులోక పృథివీలోకములను, అంతరిక్షమును, జీవులకొరకు సుఖ ప్రదముగానిర్మించి, నాయనా! జాగరూకుడవై నన్ను మరువక, ధర్మముతప్పక, ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థములనుబొంది, తన్ను పొందుమని ఆజ్ఞాపించి ప్రపంచమను ఉత్సవమునకు పంపెను. ఎట్లనగా: ఉ॥ గ్రామమున ఉత్సవము జరిగిన తల్లి బిడ్డలు చేయు మారాము భరింపజాలక రెండుఅణాలుయిచ్చి బిడ్డా! జాగ్రత్తగా పోయి ఒకఅణా పండ్లుకొని స్వామికి అర్పించి, మరియొక అణాతో తినుబండారమునుకొని తినుమని స్వాతంత్ర్యమిచ్చి పంపెను. బాలుడు తీర్థము చూడగనే తల్లి ఆజ్ఞనుమరచి, జూదమాడి రెండుఅణాలు పోగొట్టుకొని, ఒకనిజేబునుండి మనీపర్సు దొంగిలింపగా పోలీసులచే పట్టుబడి కారాగారమున బంధింపబడినట్లు జీవాత్మ, పరమాత్మ అనుజ్ఞను మరచి, కొరగాని పనులొనరించుచు కర్మయను బంధమున జిక్కుకొనుచున్నాడు. కర్మవలన జన్మ, జన్మవలన కర్మ. ఎట్లన రాత్రికి పూర్వము పగలు, పగటికి పూర్వము రాత్రి. మరియు ప్రళయానంతరము సృష్టి, సృష్ట్యానంతరము ప్రళయము. వి ఒండొంటి ననుసరించుటచే అనాదియని చెప్పబడును.

శి: గురువర్యా! దేహమునందలి తత్వముల వివరింప వేడెద.

గు: నిర్గుణపరబ్రహ్మమునందవ్యక్తముగానున్న సత్త్వరజస్తమోగుణాత్మకమగు కారణప్రకృతి కార్యరూపమగు జగద్రూపముగా మారునపుడు

సత్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః
ప్రకృతేర్మహాన్ మహతోఽహంకారోఽహంకారాత్
పంచతన్మాత్రాణ్యుభయ మింద్రియం.
పంచతన్మాత్రేభ్యః స్థూలభూతాని
పురుష ఇతి పంచవింశతిర్గణః.

సాంఖ్య॥ అ ౧॥ సూ॥ ౬౧.

తా॥ అవ్యక్తమునుండి మహత్తత్వమను బుద్ధియు, దానినుండి అహంకారము, దానివలన పంచతన్మాత్రలనబడు సూక్ష్మభూతము లైదును, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు దశేంద్రియము లనబడు పదియును, పదునొకండనదగు మనస్సును, పురుషుడనబడు జీవునితోఁగూడియుండు జ్ఞాతయుననబడు పంచవింశతి తత్వములు కలిగినవి.

పంచభూతములన పృధివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అనునవి. పంచభూతములు నొక్కొక్కటి రెండు భాగములై, అందలి ఒకభాగము మరల నాలుగు భాగములై, మిగిలిన నాలుగు భూతములయందును కలసి మొత్తము అయిదైదులు ఇరువైఅయిదు తత్వములైనవి. ఈ గోచరించు జగత్తు పంచభూతాత్మికమైనది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశపంచకము అనగా అంతరింద్రియము లనబడును. | జ్ఞాత | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| వాయుపంచకము అనగా పంచప్రాణములు. | సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము |
| అగ్నిపంచకము అనగా జ్ఞానేంద్రియములు. | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము |
| జలపంచకము అనగా పంచతన్మాత్రలు. | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
| పృధివీపంచకమనగా కర్మేంద్రియములు. | వాక్కు | పాణి | పాదము | ఉపస్థ | పాయు |

జ్ఞాత జీవునకుప్రధానమంత్రియై సర్వము తెలియపరచుచుండును.

మనస్సు సంకల్ప, వికల్పములు చేయును.

బుద్ధి నిశ్చయాత్మకము.

చిత్తము చింతన చేయును.

అహంకారము లన్నియు తానే చేయుచున్నానని తోపించును.

పంచప్రాణములనిన ప్రాణాపాన, వ్యానోదాన సమాన పంచకము.

ప్రాణము హృదయమందును,

అపానము వాయువునందును,

ఉదానము కంఠములో నుండును.

సమానము నాభివద్ద ఉండును.

వ్యానము అన్నిచోట్లను తిరుగుచుండును.

శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా ఘ్రాణములు అయిదును జ్ఞానేంద్రియములు. వీనిని గోళకములు అనికూడ అందురు. ఆకాశ భాగమగు శ్రోత్రము శబ్దమును గ్రహించును. వాయుభాగమగు 'త్వక్కు' మృదు, కఠినత్వములను గ్రహించును.

అగ్నిభాగమగు 'చక్షు' రూపమును చూచును.

నీటిభాగమగు 'జిహ్వా' మధురుచులను గ్రహించును.

భూమిభాగమగు 'ఘ్రాణము' వాసనను గ్రహించును.

పంచభూతముల సూక్ష్మాంశమైన గుణములగు శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను పంచతన్మాత్రలందురు. పంచతన్మాత్రలు గోళకములద్వారా వినుట, శీతోష్ణముల గ్రహించుట, చూచుట, రుచి గ్రహించుట, వాసన తెలిసికొనుట మొదలైన కార్యములుచేయును.

వాక్కు, పాణి, పాదము, ఉపస్థ, వాయువు అనునవియైదును కర్మేంద్రియములు.

వాక్కు— భాషించును,

పాణి— ఇచ్చి పుచ్చుకొనును,

పాదము— గమనాగమములు చేయును,

ఉపస్థ— మూత్రవిసర్జనము చేయును,

పాయు— మలవిసర్జనము చేయును. మరియు ఈశరీరము పంచ కోశములుగా విభజింపబడినది.

శి: స్వామీ! పంచకోశములనగా నేమి?

గు: పంచకోశములనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. అన్నమయకోశము స్థూల శరీరము. జాగ్రదవస్థ ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, కోశములు, సూక్ష్మశరీరము, స్వప్నావస్థ.

ఆనందమయకోశము కారణశరీరము: సుషుప్త్యవస్థ.

శి: త్రిగుణములను గురించి వివరింప కోరుచున్నాను.

గు: త్రిగుణములనగా సత్త్వ, రజ, స్తమోగుణములు.

సత్త్వగుణముద్రేకించిన తనకు, ఇతరులకును మేలుచేయుటయే గాక జ్ఞానసాధనమగును.

రజోగుణోద్రేకముచే కోరికలభివృద్ధియై జన్మ, మరణ, ప్రవాహమునకు పాల్పడజేయును.

తమోగుణముద్రేకించిన జ్ఞానము శూన్యమై అజ్ఞానము విజృంభించి తనకు మరియు ఇతరులకును హానికలిగించును. ఈ శరీరమునందలి ప్రతి ఇంద్రియమునకు అధిదేవత యున్నది.

శి: మహాత్మా! ఆయా ఇంద్రియములయందలి అధిదేవతల వివరింపుడు.

గు: ఈ ఇంద్రియములందున్న సామర్థ్యములుగల అధిదేవతల పేర్లే మనగా, మనస్సునకు చంద్రుడు, బుద్ధికి బృహస్పతియు, హస్తమునకు ఇంద్రుడును, నేత్రములకు సూర్యచంద్రులును, మూలాధార చక్రమునకు గణపతియు, స్వాధిష్ఠానమునకు బ్రహ్మయు, మణిపూరకమునకు విష్ణువును, అనాహతమునకు రుద్రుడును, విశుద్ధమునకు జీవుడు, ఆజ్ఞేయమునకు బృహస్పతియు మరియు సహస్రారమునకు గురువును అధిపతులుగానున్నారు. అనగా మూలాధారము మొదలు

సహస్రారమువరకు సప్తచక్రములు కలవు. జీవాత్మ పరమాత్మైక్యము సహస్రారమున పొందును. మరియు ఇందు డెబ్బదిరెండు వేల నాడులున్నవని శాస్త్రప్రమాణము. వీనిలో ఇడ, పింగళ, సుషుమ్న యను నాడులు ముఖ్యమైనవి. 'ఇడ' వామభాగమునందు, 'పింగళ' కుడిభాగమునందు, 'సుషుమ్న' మధ్యను గలవు. ఈమూడునాడులు ఆగ్నేయస్థానమున కలియుటచే భ్రూమధ్యము త్రివేణీసంగమ మనబడుచున్నది. ఉదయ సంధ్యలయందు భ్రూమధ్యమున లక్ష్యమునిలిపి భగవంతుని ధ్యానించిన కుండలినీశక్తి ఊర్ధ్వగామినిగా మారును.

శి: దయామయా! కుండలినీశక్తిని గూర్చి వివరింపుడు.

గు: మూలాధారమందు సర్పాకారముగల ఒకశక్తి ఉండును. అజ్ఞానులకు ఆశక్తి క్రోధమను విషముగ్రక్కుచు తల క్రిందికి, తోక పైకి నుండును. వివేకముకలిగి సాధనయందు ప్రవేశించినవారికి దాని చుట్టలువిడి ఊర్ధ్వముఖి యగును. సాధన తీవ్రమయినకొలది మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆగ్నేయ, చక్రములచేరినస్థితిలో భగవద్విషయముతప్ప వేరేమియు రుచింపదు. ఇట్టిస్థితిలోకూడ సాధకుడు బహుజాగ్రత్తగనుండిన సహస్రారముచేరి సమాధిస్థితిని పొందగలుగును. క్రిందిస్థానములం దుత్తమలక్షణ మొక్కటియు గానరాక, పైస్థానములయందు అనేక దివ్యలక్షణములతోనొప్పును. కుండలినీశక్తి ఒక్కొక్క స్థానమందున్న ఒక్కొక్క యోగానుభవము కలుగునని రామకృష్ణపరమహంస నుడివియున్నారు. ఈశక్తి మనస్సుతో నడచుచు సహస్రారమున మాయమగును.

శి: దేహలక్షణముల వివరింప కోరుచున్నాను.

గు: దేహలక్షణము లెట్టివనగా పుట్టుట, పెరుగుట, ఉండుట, పరిణామమొందుట, క్షీణించుట, నశించుట. ఈ యారువికారములు ప్రకృతి

సహజములు. జీవాత్మ ఇట్టి వికారములతో గూడిన దేహమే తానని భ్రమింపక దేహవిలక్షణుడ ననియు, దయామయుడగు పరమేశ్వరునిచే తాను నివసించుటకు నిర్మింపబడిన అద్దెగృహము వంటిది, కావున ఎప్పటికైన ఖాళీచేయుక తీరదనియు, గ్రహించి మోహరహితుడై యుండవలెను. మోహమనగా కేవలము తనకు, తన సుఖకారకులగు భార్యాపుత్రాదులను మాత్రమే అతి విపరీతముగ ప్రేమించుట యని భావము.

శి: స్వామీ! మీవలన నెరింగిన విషయములు నాకమితానందము కలుగజేయుచున్నవి. దయయుంచి జీవాత్మ శరీరమునందెచ్చట యుండునో వివరింపుడు.

గు: జీవాత్మకు హృదయపద్మము నివాసస్థానము. ఈ పద్మమునకు ఎనిమిది దళములుకలవు. ఒక్కొక్క దళమందు నిలచిన ఒక్కొక్క చింతన కలుగును. ఈ చాంచల్యమును భగవత్ ప్రార్థన, యోగాభ్యాసము, వేదాంతవిచారణ, జ్ఞాననిష్ఠాసాధనలద్వారా దూరమొనర్చి సుషుమ్నాంతర్గతుడు కావలయును.

శి: జీవాత్మలు ప్రళయమందు పరమాత్మయందే హాయిగ నుండియు ప్రకృతి సుఖముల నేల కోరిరి?

గు: మానవుడు పట్టుపరుపులపైన పరుండిన సుఖమే. కాని అట్లెంత కాలము పరుండియుండగలుగును? ఇట్లే జీవాత్మలు పరమాత్మయందే యున్నను పూర్వవాసనా బలముచే దేవుని ప్రార్థించి తగిన దేహములను పొందుదురు.

శి: స్వామీ! పరమాత్మ తన వినోదముకొరకు జగత్తును నిర్మించి తద్వారా క్రీడించుచున్నాడని చెప్పబడు వాక్యములు సత్యమేనా?

గు: అట్లనుట సమంజసముకాదు. ఏలయన తనవినోదము నిమిత్తమై ఇందరిని కష్ట సుఖముల పాలొనర్చి వినోదించువాడైన దయా

స్వరూపుడను వేదవచనమునకు వ్యతిరేకమగుటయేగాక వినోద నిమిత్తమనుటచే పరమాత్మకు వినోదమనునది కొరత యున్నదని అర్థమగుటవలన పూర్ణుడను ప్రమాణముగూడ వ్యర్థమగును. దయామయుడుగాన జీవులయెడగల దయచేతనే సర్వజగత్తును వారి కనుకూలముగా రచించి దానముచేయుటచే దాతయను ప్రమాణము నకు కూడ తగియుండును.

శి: శరీరమందు జీవుని లక్షణములెవ్వి?

గు: న్యాయప్రమాణ ప్రకారము

'ఇచ్ఛాద్వేషప్రయత్న సుఖదుఃఖ జ్ఞానాన్యాత్మ
నోలింగ' మితి 'న్యా'. అ౧॥ పా౧॥ సూ౧౦.

అ ర్థ ము.

ఇచ్ఛ ఇష్టమగుదానిని అభిలషించుట, (ద్వేష) అనిష్టమగు దానిని అసహ్యించుకొనుట, (ప్రయత్న) పురుషార్థముకొరకు ప్రయ త్నించుట, (సుఖ) హాయి కలిగినప్పుడు ఆనందించుట, (దుఃఖ) బాధ కలిగినప్పుడు శోకించుట, (జ్ఞానం) తెలివికలిగియుంఘట నీయారును జీవునకు స్వతసిద్ధములగు ముఖ్యలక్షణములై యున్నవి.

శి: గురువర్యా! దేహమందున్న జీవగుణముల నెట్లు గుర్తింపబడును?

గు: వైశేషిక ధర్మశాస్త్రమునందు చెప్పియుండు ప్రమాణరీత్యా

'ప్రాణాపాననిమేషోన్మేష మనోగతేంద్రియ వికారాః
సుఖదుఃఖేచ్ఛాద్వేషాప్రయత్నా శ్చాత్మనోలింగాని'
వైశేషిక ॥ అ 3 ॥ పా ౨ ॥ సూ ౪.

అ ర్థ ము.

శరీరమందు జీవుడు ప్రాణమును బీల్చుటయు, అపానమును వదలుటయు, నిమేషము అనగా కన్నులు మూయుటయు, ఉన్మేషము అనగా కన్నులు తెరచుటయు, మనస్సుతో సంకల్ప వికల్పముల

చేయుటయు, గతి అనగా కదలుటయు, ఇంద్రియముల నడపుటయు, అంతర్వికారముల బొందుటయు, అనగా ఆకలిగొనుటయు, దప్పిగొను టయు, సంతోషించుటయు మరియు శోకించుటయు, నీ యారువికార ములును దేహమునందుగల జీవాత్మకు సహజములై యున్నవి. జీవుడు దేహమునుండి తరలినపుడు ఇట్టి క్రియలు జరుగవు.

శి: జీవుని స్వరూపమేమి ?

గు: జీవుడు నిరాకారుడు.

శి: జీవుని లక్షణములెవ్వి ?

గు: జీవుడు సత్ అనగా శాశ్వతుడు, చిత్ అన తెలివిగలవాడునై యున్నాడు.

శి: దేవుడు సాకారుడా, నిరాకారుడా ?

గు: పరమాత్మ నిరాకారుడు, మరియు సచ్చిదానందస్వరూపుడు.

శి: గురువర్యా! దేవుని క్రియాలక్షణము లెట్టివి ?

గు: బ్రహ్మసూత్రమునందలి సూత్రముప్రకారము.

"జన్మాద్యస్యయతః" అ ౧॥ పా ౧॥ సూ ౨॥

తా॥ ఈ గోచరించు శరీరజగత్తులకు సృష్టి, స్థితి, వినాశము లను జరిగించువాడే పరమాత్మయని చెప్పియుండుటచే సృష్టికి కర్తృ త్వము, పోషకత్వము, సంహారకత్వములను క్రియలే అతని ముఖ్య లక్షణములై యున్నవి. సృష్టిద్వారా మనము పరమాత్మ మహిమను గుర్తింపవలెను.

శి: స్వామీ! సృష్టిద్వారా పరమాత్ముని మహిమ నెట్లు గుర్తింప గల్గుదుము ?

గు: పరమాత్ముని శక్తిచే సూర్యచంద్రాదులు, భూమి, మొదలగు గోళకములు, మరియు సముద్రములు మేరతప్పకుండుటయు, సమస్త వృక్షలతాదులు ఫలించుటయు, ఉత్పత్తి.స్థితి వినాశములు

జరుగుటయు, సమస్త జీవరాసులు కన్నులతో చూచుటయు, చెవులతో వినుటయు, వాక్కుతో భాషించుటయు మొదలగు సర్వకార్యములు జరుగుచున్నవి.

శి: పరమాత్మ నిరాకారుడైన జగత్తును ఎట్లు సృష్టించగలుగును ?

గు: నీవు ప్రశ్నించిన విషయము బహుముఖ్యమైనది. వత్సా ! వాయువు నిరాకారమైనను తన సామర్థ్యముచే ప్రపంచకమును అల్లకల్లోలము చేయకలుగుచున్నది. అట్లే పరమాత్మ నిరాకారుడైనను తన అనంతసామర్థ్యముచే జగత్తును సృష్టింపగలుగుచున్నాడు.

శ్వేతాశ్వతరోపనిషత్తునందలి ప్రమాణము చూడుము.

మం॥ అపాణిపాదో జవనోగ్రహీతా పశ్యత్యచక్షుః సశృణో త్యకరణః సవేత్తి వేద్యం నచతస్యాస్తివేత్తాతమాహురగ్ర్యం పురుషమ్ మహాంతమ్॥ శ్వే॥ అ 3॥ మం ౧౯॥

అర్థము.

పరమాత్మ చేతులులేకయే తన అనంతసామర్థ్యములను చేతులతో సమస్తజగత్తును రచించువాడును, కాళ్ళులేకయే వ్యాపకుడగుట వలన అధికవేగవంతుడును, కనులులేకయే ఉన్నదున్నట్లు కనుగొను వాడును, చెవులులేకయే సమస్తజీవరాసుల మాటలను వినువాడును, అంతఃకరణములేకయే సమస్తజగత్తును గ్రహించువాడును నై యున్నాడు. అతడు సనాతనుడు. అందరికంటె శ్రేష్ఠుడును మరియు అన్నిటియందు పూర్ణుడగుటచే పురుషుడనబడును. ఎవ్వరును అతనిని సంపూర్ణముగ తెలియజాలరు.

శి: భగవంతుని అనేకులు నిష్క్రియుడనియు, నిర్గుణుడనియు, శూన్యుడనియు నుడువుట సత్యముకాదా ?

గు: శ్వేతాశ్వతరోపనిషత్తునందలి ప్రమాణప్రకారము నీవు నుడివినది సత్యముకాదు.

మం॥ నతస్య కార్యం కరణంచ విద్యతే నతత్సమశ్చా
భ్యధికశ్చ దృశ్యతే పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే
స్వాభావకీ జ్ఞానబలక్రియాచ.

శ్వే॥ అ ౬॥ మం ౮॥

అర్థము.

ఆ పరమాత్మ కార్యమువంటి కార్యము, ఆ సర్వశక్తివంతునకు కరణము అనగా సృష్టిచేయుటకు వేరు కార్యసాధనముల అవసరమును లేదు. అతనితో సమానుడు, నధికుడుగాని ఎవ్వడునులేడు. సర్వోత్తమ శక్తివంతుడగు నా పరమాత్మయందు అనంతజ్ఞానము, అనంతబలము మరియు ననంతక్రియయు నున్నది. అది అతనికి స్వాభావికమని విదితమగుచున్నది. పరమాత్మ నిష్క్రియుడేని జగత్తుయొక్క యుత్పత్తి స్థితి ప్రళయములను చేయజాలడు. కావున యతడు విభుడు చైతన్య స్వరూపుడు నగుటవలననే యతనియందు అద్భుతమగు క్రియ యవశ్యముగనున్నది.

శి: భగవంతుడున్నాడని నమ్ముట ఎట్లు ?

గు: ప్రత్యక్షప్రమాణములచే దేవుడున్నాడని నమ్మవలసియున్నది. ఎట్లన శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ, మనస్సులకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, సుఖ, దుఃఖ, సత్యాసత్యాది విషయ సంబంధముచే నేజ్ఞానముత్పన్నమగుచున్నదో అది ప్రత్యక్షమని చెప్పబడును. ఈలాగుననే భగవంతునియందు ప్రత్యక్షప్రమాణము ఘటించుచున్నది. మన ఆత్మయందు చెడుకార్యము చేయుటకు సంకల్పించినచో శంకయు భయమును కలుగును. మంచికార్యము చేయబూనిన నిర్భయము, ఆనందము కల్గును. ఇవి జీవాత్మయందు వ్యాపకుడై యుండు పరమాత్మనుండి కలుగునుగాని జీవాత్మనుండి కాదు. కార్యమును చూచి కారణమును గ్రహించునట్లే జగద్రచనాది కార్య

ములచూచి తన్నిమిత్తకారణకర్తయగు పరమాత్మను గ్రహింపవల యును. యోగి పరమాత్మధ్యానమందు మగ్నుడై మనస్సును బ్రహ్మ మందు లయింపజేసి తన్ను తాను మరచిన పరమాత్మ ఆనందస్వరూ పమున స్వానుభవమునకు గోచరించును.

శి: మీవాక్యములచే పరమాత్మ మనయందుకూడ వ్యాపించియున్నట్లు అర్థమగుచున్నది నిరాకారుడగు జీవాత్మయందు పరమాత్మ ఎట్లు వ్యాపించియుండెను ?

గు: నాయనా! ప్రకృతి స్థూలము, జీవుడు సూక్ష్మము, పరమాత్మ అతిసూక్ష్మము గావున వ్యాపించియుండును. ఎట్లన రంగుకలసిన నీటిలో ముంచబడిన వస్త్రమునందు ఒకేస్థానమున మూడుతత్వ ములు ఇమిడినవి. నూలు స్థూలము, రంగు సూక్ష్మము, నీరు పరమసూక్ష్మము గావున ఇమిడినవి. ఇంకను క్రిందిప్రమాణము చూడుము.

తత్ సృష్ట్వాత దేవానుప్రవిశత్ ॥తై॥ బ్రహ్మానంద అను ౬.

తా॥ పరమేశ్వరుండు శరీరాదులు సృష్టించి జీవుల ప్రవేశింప జేసి తాను జీవులయందు వ్యాపించి అంతర్యామియై తన విజ్ఞానరూప మగు వేదముద్వారా సమస్తనామరూపాదులయొక్క విద్యను ప్రకట పరచుచున్నాడు. కాన జీవులయందు తాను అనుప్రవిష్టుడగుచున్నాడు. కొందరు యీ సత్యార్థమును గమనింపక భగవంతుడు శరీరముల నిర్మించి అందు ప్రవేశించి పాపపుణ్యములు, కష్టసుఖములు మొద లగునవి అనుభవించుచున్నాడనికూడ నుడువుచున్నారు. పరమాత్మ తన ప్రతిబింబమగు చిదాభాసుడే తానని భ్రమించినందున అవిద్యకు వశుడాయెననియు, యీభ్రమ తొలగించి పరమాత్మయే తానని గ్రహించిన బ్రహ్మయే యగుననియు అందురు.

శి: స్వామి! ఈవిషయమై మీ అభిప్రాయము ఎట్టిదో ఎరిగింపగోరు చున్నాను.

గు: దేవుడు సర్వజ్ఞుడని ఉపనిషత్తులు ఘోషించుచుండ ప్రతిబింబమును చూచి తానేల భ్రమయందుపడును? అంతఃకరణయందు గూడ పరమాత్మ వ్యాపించియుండుటచే పరమాత్మకు ప్రతిబింబమే రాదు. సూర్యుడు పరిమితుడు, ఏకదేశి గాన సూర్యునకు వేరుగానుండు నీటికుండలలో వేరువేరు ప్రతిబింబములు ఏర్పడును. సూక్ష్మమగు గాలికి, మరి సూక్ష్మమగు ఆకాశమునకు ప్రతిబింబము గానరానపుడు పరమసూక్ష్మమగు పరమాత్మకు ప్రతిబింబమెట్లువచ్చును? పరమాత్మ తన్ను మరచి ఎన్నటికిని అజ్ఞానిగా మారడు. జీవుడీప్రకృతియందు ఆసక్తుడై అవిద్యాబంధమునబడి శాంతిలేనందున తిరిగి అవిద్యనుండి విడివడుటకు సాధనచేసి పరమాత్మను పొందును.

శి: మహాత్మా! పరమాత్మబంధమందు జిక్కకున్న జీవాత్మ ఏల బంధమందు జిక్కెను?

గు: జీవాత్మ పరమాత్మల భేదమెట్టిదనగా, దేవుడు సర్వవ్యాపి, జీవుడు ఏకదేశి; దేవుడు సర్వజ్ఞుడు, జీవుడు కించజ్ఞుడు; దేవుడు సర్వశక్తివంతుడు, జీవుడు స్వల్పశక్తివంతుడు; దేవుడు ఆనందస్వరూపుడు, జీవుడు ఆనందరహితుడు గావున ప్రకృతి జీవుని ఆకర్షింపగలిగినది. సర్వజ్ఞుడగు పరమాత్మను జడమగు ప్రకృతి ఆకర్షించుట అసంభవము.

శి: గురువర్యా! జీవబ్రహ్మ లిరువురు నిరాకారులనిగదా విదితమగుచున్నది. అట్టిచో సమానులనిన దోషమేమి?

గు: ఈక్రింది ప్రమాణప్రకారము నిరాకారులయినను సమానులు గారని గ్రహింపవలయును.

మా॥ ద్వాసుపర్ణా సయుజాసఖాయ సమానం
వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం
స్వాద్వత్త్యనశ్నన్నన్యో ఽభిచాకశీతి ॥ఋ॥ మం ౧॥ సూ ౧౬౪.

తా॥ జీవబ్రహ్మలిరువురు చేతనత్వమునందు, సూక్ష్మత్వము నందును సమానులు. వ్యాప్యవ్యాపకసంబంధముచే సంయుక్తులు, పరస్పరమిత్రులును. అనాదిసిద్ధులును, నిరాకారమునందు సమానాకారముగలవారునై యున్నారు. అనాదియగు మూలప్రకృతి సృష్టియందు స్థూలరూపమై, తిరిగి ప్రళయమందు ఛిన్నభిన్నమై సూక్ష్మమగు పరమాణువులుగా మారుచుండు ప్రకృతియను మూడవ పదార్థముగూడ అనాదియే అగును. ఈ మూటియొక్క గుణ, కర్మ, స్వభావములుగూడ అనాదియే యగుచున్నవి. ఇందు జీవబ్రహ్మలలో జీవుడొక్కడే ప్రకృతిరూపమగు జగద్వృక్షమునందలి పాప పుణ్య ఫలములను భుజించుచున్నాడు. పరమాత్మమాత్రము భుజింపక సర్వత్ర ప్రకాశమానుడై యున్నాడు. కావున జీవునికంటె దేవుడును, దేవుని కంటె జీవుడును వీరిద్దరికంటె ప్రకృతియు భిన్నస్వరూపములై యీ మూడును అనాదిసిద్ధములై యున్నవి. కావున పరమాత్మ సర్వవ్యాపకము. జీవప్రకృతులు అందు వ్యాప్తములై యున్నవి. స్వరూపక్రియా లక్షణములచే వేరై వ్యాప్యవ్యాపకసంబంధముచే వేరుగాక యున్నారు. ఇట్లే సృష్టికాలమందును వ్యాప్తములుగనే యున్నారు.

శి: సృష్ట్యాదిని మానవదేహములు ఎట్లు నిర్మింపబడినవి ?

గు: స్వేదజములగు పేలు మొదట వాసనవలన బుట్టి, తదుపరి వానికి గ్రుడ్లుకలిగి ఆజాతి వృద్ధియగునట్లు మొదట సృష్టియందు పంచ భూతములు బైల్వెడలిన క్రొత్తలో గంధమధికముగానుండుటచే నా వాసనవలన కొందరు అయోనిజులుగా జన్మించి తద్వారా వంశపరంపరలుగా అభివృద్ధియైరి. మొదట జన్మించినవారిలో నలుగురు సమాధిసిద్ధులై భగవద్ధ్యానముతప్ప తదితరమెరుంగక యుండగా ఆ నలుగురు మహర్షుల వాక్కులనుండి అప్రయత్న ముగా నాలుగువేదములు వెలువడినవి. బ్రహ్మ నాలుగువేదములు

కంఠస్థముచేయుటచే చతుర్ముఖుడని బిరుదు కలిగినది. కాని నాలుగుముఖములు లేవని సుహానీయుల అభిప్రాయము.

శి: స్వామీ! వర్ణవిభేదము లెట్లేర్పడినవి ?

గు: వర్ణవిభేదములెట్లేర్పడినవనగా కొందఱుశేపస్సుచేయుచుండుటయు, కొందరు వారలను కాపాడుటయు, మరికొందరు ఆహారపదార్థములను సరుకూర్చుటయు, మరికొందరు కష్టించి పనిచేసి పండించుటయు మొదలగునవి చేయుచువచ్చిరి. బ్రహ్మ నిష్ఠాగరిష్ఠులగువారు బ్రాహ్మణులనియు, రక్షణచేయువారలను క్షత్రియులనియు, ఆహారములను సరఫరాచేయువారిని వైశ్యులనియు, కాయకష్టమున పనిచేయువారిని శూద్రులనియు ఈ నాలుగువర్ణములుగా పేర్కొనబడిరి.

శి: ఈ నాలుగువర్ణములలో నేవర్ణము ఉన్నతమైనది ?

గు: సృష్టికి బ్రాహ్మణులు విజ్ఞానముకల్గినవారు గావున ముఖమువంటివారనియు, క్షత్రియులు భుజబలముకల్గినవారుగావున భుజములవంటివారనియు, వైశ్యులు సరఫరాయందు నేర్పరులుగావున కటిప్రదేశమువంటివారనియు మరియు శూద్రులు సేవాతత్పరులుగావున పాదములవంటివారనియు అర్థము. ఈశరీరమునందలి భాగములన్నియు ఎట్లు అవసరమో అట్లే సృష్టికి అన్నివర్ణములవారును అవసరమై యున్నారు. భగవత్సృష్టిలో మానవజాతియంతయు నొక్కటియే గావున ఎట్టిభేదమునులేక వారివారి వర్ణాశ్రమధర్మముల పాటించుచు, విద్యావంతులు దయాస్వరూపులై విద్యావిహీనులకు బోధించి ఉన్నతస్థితినొందింపవలెను. మానవునకు బ్రాహ్మణజన్మయు. సౌందర్యము, విద్యయు మరియు ధనముగాని, వీనిలో ఏదిలభించినను తప్పక గర్వము జనించును. ప్రహ్లాదునకు ఈనాలుగు లభించినను ఎంతమాత్రము గర్వింపనందున హరిహరాదులకైన నందని భక్తిగలవాడాయెను.

శి: ఇంక ఆశ్రమధర్మములను వివరింపుడు.

గు: మానవునకు నూరేండ్ల పరిమితిగల ఆయుస్సు నాలుగు భాగములుగ విభజింపబడి బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములనబడు నాలుగాశ్రమములుగూడ నిర్మింపబడినవి. బ్రహ్మచర్యమున ధర్మమార్గానువర్తులై చక్కని విద్యనార్జించి, జ్ఞానసాధనులై, సత్సాంగత్యము, సత్ప్రవర్తనగలిగి, తల్లిదండ్రులయందును మరియు గురువులయందును భక్తితో వారియాజ్ఞానువర్తులై, శ్రద్ధ, దైవభక్తి, వినయము, అహింస, సత్యము మొదలగు సద్గుణములతో ప్రవర్తించి, జ్ఞానమార్జింపవలయును. విద్యాభ్యాసకాలమున స్త్రీలను గురించి ముచ్చటించుట, అనవసరపు విషయములందు పాల్గొనుట కూడదు. ఈ నియమములు విద్యార్థినులకుకూడ నవసరము.

ఇంక గృహస్థాశ్రమమనగా స్త్రీపురుషులిరువురు యుక్తవయస్కులైనపిమ్మట తమకనుగుణమగువారిని వివాహము చేసికొని బ్రహ్మచర్యాశ్రమమందు తామార్జించిన జ్ఞానప్రకారము ఇరువురు అన్యోన్యతతో పరోపకారము, అతిథిసత్కారము, ధర్మాసక్తితో చేయుచు ఏకమనస్కులై, భగవదారాధనచేయుచు చక్కని సత్పుత్రులబడసి, బిడ్డలను ధర్మమార్గానువర్తులుగను, భక్తులుగను పరోపకార పారీణులుగను దయార్ద్రానర్చవలెను. న్యాయార్జనచే ధనముగణించి సద్వ్యయముచేయుచు తగినంత పుణ్యమార్జింపవలయును. మనముచేయు పుణ్యము ప్రయాణమునందుపయోగపడు చద్దిమూటవలె మనకు ఉపయోగించును.

వానప్రస్థాశ్రమమందు బాధ్యతలు వదలుకొని సాత్వికాహారులును, బ్రహ్మచర్యానుష్ఠానులునై అన్యచింతలులేక కేవలము భగవద్ధ్యానమందే కాలముగడుపవలయును.

సన్యాసమందు యోగసిద్ధినొంది, ఇతరులకు జ్ఞానోపదేశము

చేయుచు, దేహమాత్రావలంబులై సర్వకాలసర్వావస్థలయందు నిర్వికల్పులై యుండవలయును.

ఈవిధముగా బాల్యమున జ్ఞానార్జన, గృహస్థాశ్రమమున కర్మాచరణ, వానప్రస్థాశ్రమమున కేవల భక్తి, సన్యాసమున యోగసిద్ధిని పొంది మానవజీవితమును సార్థకతనొందించుకొనవలయును.

శి: మీచే నెరింగిన ఆశ్రమధర్మములెంతయో నన్ను ఉత్సాహపరచుచున్నవి. ఇంకనూ సతీధర్మముల వినగోరుచున్నాను.

గు: సతీమణులందరు పైన నుడివిన ధర్మములన్నియు ఆచరింపవలయును. స్త్రీలుకూడ బ్రహ్మవిచారణచేసి గమ్యస్థానమును పొందవలయును.

స్త్రీలెల్లరు బ్రహ్మముహూర్తమునలేచి, భగవంతుని ధ్యానించి, దైవసమానుడగు భర్తకు నమస్కరించి, గృహకృత్యములన్నియు బహుశ్రద్ధతోడను, భగవత్సేవగను భావించి చేయుచుండవలయును. భర్తను అతిభక్తితో సేవింపుచు, అతని ఆజ్ఞకు వ్యతిరేకముగ ప్రవర్తింపక సత్ప్రవర్తనకలిగియుండవలయును. ప్రారబ్ధవశమున భర్తదుర్మార్గుడైన అతనిని సన్మార్గమునకు త్రిప్ప ప్రయత్నించియు, సాధ్యముకానిచో దూషింపక, సదా తనభర్తను సన్మార్గమునకు త్రిప్పుమని భగవంతుని వేడుచు, కామక్రోధములచే తపింపక, ఓర్పుకలిగి యుండవలయును. ఐశ్వర్యవంతుల భోగములు చూచి తనకు కావలెనని భర్తను పీడింపక, సదా చురుకుగను, సంతోషముగను నుండవలయును. కష్టసుఖములయందు ఓర్పుగలిగి శక్తియున్నంతలో పరోపకారముచేయుచు, భర్తయొక్క ఆదాయమునుమించి వ్యయముచేయక, తనకున్నంతలో కొలదిగనైననూ దానముచేయుటయందుత్సాహము కలిగి యుండవలయును. క్రోధము, పెద్దలను తృణీకరించుట ఉండరాదు. బిడ్డలను భగవ

త్స్వరూపముగ భావించి వారికిచేయు ఉపచారముచేయుచు, నీతిని బోధించుచు, తప్పుచేసిన శిక్షించుచు వారిని ఆదర్శప్రాయుల నొనర్చుబాధ్యత తల్లిదై యున్నది. పరపురుషులను సోదరులుగ భావించవలయును.

పురుషులుగూడ స్త్రీలను తమ సేవకొరకు నియమింపబడిన దానిన అని తలంపక గౌరవముగ చూడవలసి యున్నది.

శి: మానవులు మీరు నుడివిన ధర్మానుసారము ప్రవర్తింపకపోవుటకు కారణమేమి?

గు: మానవులు అవిద్యాపరిభావముచే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను అరిషడ్వర్గములకు లోబడుటచే సన్మార్గ వర్తులు కాజాలకున్నారు.

శి: అవిద్యయన నెట్టిది?

గు: అనిత్యములగు శరీరప్రపంచములను, నిత్యములనియు అనగా ప్రకృతియొక్క కార్యరూపమగు దృశ్య ప్రపంచము సదా ఇట్లే యుండుననియు, దేహాదులుగూడ శాశ్వతముగ నుండుననియు, ననుకొనుటవలన కలుగు విపరీతబుద్ధియే అవిద్య యనబడును.

శి: అవిద్యవలన కల్గు ప్రమాదమేమి?

గు: ఈ అవిద్యాపరిభావముచే దుఃఖరూపమగు జగత్తు సుఖముగను, జడము చేతనముగను, చేతనము జడముగను, కించిజ్ఞుడు సర్వజ్ఞుడు గను, సర్వజ్ఞుడు కించిజ్ఞుడుగను తోచుచుండును.

శి: విద్య యన నెట్టిది?

గు: దుఃఖదాయకములగు మిథ్యాభాషణాది అధర్మములను త్యజించి, ఉన్నదున్నట్లు తెలిసికొని సుఖదాయకములు మోక్షదాయక ములు నగు పరోపకార సత్యభాషణాది ధర్మముల నిష్కామ్య ముతో నొనరించుటయు పరిపూర్ణత స్వతస్సిద్ధముగా అందరియం

దును నిండియున్నది గాన దానిని వ్యక్తీకరించుకొనుటయే విద్య యనబడును.

శి: గురువర్యా! జ్ఞానమన నేమి?

గు: బ్రహ్మ నిత్యమనియు, గోచరించు ప్రకృతి పరిణామిని యనియు, వినాశిని యనియు, సర్వము భగవత్కార్యమని గ్రహించి తాను తటస్థుడనేయని ఎరుగుట జ్ఞానమనబడును.

శి: విజ్ఞాన మన నేమి?

గు: పైన గ్రహింపబడిన విషయములు భావమున నిలుపుకొని సర్వత్ర భగవంతుని దర్శించుచు పరమాత్మయందు సమస్త భూతములను, సమస్తభూతములయందు పరమాత్మనుదర్శించి అనుభవముపొందుట విజ్ఞానమనబడును.

శి: మానవుడు జ్ఞాన, విజ్ఞానములకొరకు ప్రయత్నింపక ఏల మోహమందు జిక్కుచున్నాడు?

గు: మానవుడు ప్రకృతియందలి విషయానందమును మరిగి దారేషణ, ధనేషణ, పుత్రేషణ యను ఈషణత్రయములచే కట్టుబడి తన స్వార్థముకొరకు భార్యాపుత్రాదులయందు మిక్కిలి మోహముచే తాదాత్మ్యభావమునుపొంది బాధనొందుచున్నాడు. తనదేహామే తానుగానపుడు భార్యాపుత్రాదుల దేహములు తానెట్లగును? సరియగు విమర్శనజ్ఞానము లేనందున ఆధ్యాత్మిక, ఆదిభౌతిక తాపములను భగవంతునియం దారోపణ చేయుచున్నాడు.

శి: ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక తాపములన నెట్టివి?

గు: మానవుడు మితాహారియు, మితభాషియు గానందున కల్గు బాధలు ఆధ్యాత్మిక తాపమనబడును. విషజంతువులవలన మరియు ఇతరుల వలన కలుగు బాధలు ఆదిభౌతికతాపమనబడును.

పిడుగుపడుట, తుపాను రేగుట, భూకంపము కలుగుట మొదలగునవి ఆదిదైవిక తాపమనబడును. తనప్రయత్నము సరిగనున్న

ఆధ్యాత్మిక, ఆదిభౌతిక తాపమునుండి తప్పించుకొనవచ్చును. కాని ఆధిదైవిక తాపమునుండి తప్పించుకొనుట యసాధ్యము. వివేకములేమిచే మానవుడు యదార్థమును గ్రహింపజాలకున్నాడు.

శి: స్వామి! వివేకమననేమి?

గు: మానవులు వివేకములేమిచే ఈశరీరము, సిరిసంపదలు, బంధువులు, విషయభోగములు మొదలగు సర్వము నిత్యమని వానియొక్క యదార్థస్థితి నాలోచింపక, కాంక్షితులగుటవలన జన్మపరంపరలకు గురియగుచున్నారు. సంసార సముద్రమును దాటగోరువారికి భగవదాశ్రయముతప్ప వేరుమార్గము గానరానందున విషయముల నుండి మనస్సు భగవంతునివైపు మరల్చుటకు వైరాగ్య మత్యావశ్యకము.

శి: వైరాగ్యమననేమి?

గు: భౌతికపదార్థములయందలి మోహమును త్యజించి మనస్సును బలవంతముగ భగవంతునివైపు మరల్చుటయే వైరాగ్యము. ఇంకను బోధ అత్యావసరము.

శి: బోధ యననేమి?

గు: భగవంతుడు తనయందును సర్వత్ర నిండియున్నాడని నమ్మికతో బుద్ధిపూర్వకముగా ఏప్రాణికి అపచారము కల్గింపక, సదా భగవన్నామమును జపించుచు, సద్గ్రంథపఠన యొనర్చి, అందాదేశించిన ప్రకారము ప్రవర్తించుచు, భగవంతుడు సర్వత్ర నిండియున్నాడని దృఢనిశ్చయము కల్గుటకు సదా బోధించుకొనుచుండవలయును.

శి: సద్గ్రంథము లనగా నెవ్వి?

గు: అనుభవానుకూలములగు గ్రంథములే సద్గ్రంథము లనబడును.

శి: ఉపరతి యననేమి?

గు: గురువుచే నెరింగిన లక్ష్యమందు మనస్సు నిలిపి తైలధారవలె బ్రహ్మాను సంధానముచేయుట ఉపరతి యనబడును.

ధ్యానమందు వృత్తులుపుట్టుట విక్షేపము, వృత్తుల నిరోధించి బుద్ధిని లక్ష్యమందు నిలుపుట ధారణ, ధారణ యభివృద్ధిచెందిన ధ్యాన మనబడును.

శి: గురువర్యా! ధ్యానించు విధానమెరిగింపగోరెద.

గు: నిర్మలమైన స్థానమున సుఖాసీనుడై భ్రూమధ్యమున దృష్టినిలిపి, ఓంకారమును ధ్యానింపవలెను. మనస్సును చెదరనీయక ఏకాగ్రత నొందించి మిక్కిలిభక్తితో ప్రతిదినము నియమముతప్పక దేవ దేవుని ధ్యానించిన అనేకచిత్కళలు గోచరించును. ఈచిత్కళలను గాంచిగాంచి మనస్సు నిశ్చలతనొందుటవలన బ్రహ్మనిష్ఠ కుదిరి చిత్తశాంతి కలుగును. అట్టిస్థితియందు తటస్థభావముకలిగి సమాధి నొందును. అనగా బాహ్యస్ఫురణ యుండదు.

శి: మనస్సు అతిచంచలము కావున నిశ్చలత నెట్లు పొందగలుగును?

గు: మనస్సు కేవల భక్తిచే అభ్యాసబలముకలిగి శాంతినొందుట వల నను, ప్రాణాయామము వలన శ్వాస స్వాధీనమగుటవలనగూడ మనస్సు నిశ్చలతనొందును. బ్రహ్మవిద్య సూక్ష్మమైనది కావున సద్గురువుచే నెరుంగవలెను. భౌతికవిద్యలకే గురువు ఆవశ్యకము గావున సూక్ష్మాతిసూక్ష్మమగు బ్రహ్మవిద్యను బోధించుటకు గురువు అత్యవసరమని గ్రహించవలయును.

శి: ఓంకారమును ధ్యానింపమని నుడివియున్నారు గాన అందలి విశే షము లెరిగింప వేడెద.

గు: ఓంకారము పరమాత్మకు ముఖ్యనామమై యున్నది. మిగిలిన నామములు భగవంతుని ఒక్కొక్కశక్తినిగూర్చి తెల్పును. ఓంకా రము స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగములలో నేదియునుగాక పరమాత్మవలెనే అన్నిటికి అతీతమై సర్వశక్తివిదితమై యున్నది. ఓంకారమునందు అకార, ఉకార, మకారములు కలవు. ఓంకా

రము లేనిశబ్దము లేకపోవుటయేగాక పరమాత్మయందు సమస్త వస్తువులు పుట్టి అందే లయించుచున్నట్లు ఓంకారమునందే సమస్త శబ్దములు పుట్టి అందే లయమందుచున్నవి. అకారము బ్రహ్మ, ఉకారము జీవుడు, మకారము ప్రకృతి గావున విశ్వమంతయు ఓంకార స్వరూపమనిగూడ వర్ణింపబడియున్నది. ధ్యానసమయ ముననేకాక యితరసమయములందు నామస్మరణము చేయవలెను.

శి: నామస్మరణమువలన కలుగు ప్రయోజనమేమి?

గు: నామమహిమ ఇంతయని వర్ణించు టసాధ్యము. ఐనను క్లుప్త ముగ నుడివెదను సావధానుడవై వినుము. రామనామము, కృష్ణ నామము మరి ఏఇతర నామమైనను భగవన్నామమే యను జ్ఞప్తి తోడను, భక్తితోడను స్మరించినచో అమృతము వెల్లివిరియును. నామము సంసార సముద్రమును దాటగోరువారికి నావ వంటిదియు, అతి రుచికరమైనదియు, స్మరించువారి నేగాక వినువారినిగూడ ప్రేమ యను ఆనందమున ముంచి హృదయము కరిగించివేయుగల శక్తి వంతమయినదనుట నిర్వివాదాంశము. నామమువలననే భగవం తుని గ్రహించుటయును, ఆయనతో స్నేహముచేయుటయునుగాక నామమువలననే భగవంతునితో కలియవలయును. హనుమంతుడు, రామదాసు, ద్రౌపది మొదలైనవారు నామ ప్రభావమువలననే తమకార్యముల నెరవేర్చుకొనగల్గిరి. నామము ఒంటరిగానున్న వారలకు పరమ మిత్రునివంటిదియు, ఆపదలయందు దుఃఖమును మరపించి చిత్తమునకు విశ్రాంతి కల్గించునట్టిదియును, మరియు మనకు నామస్మరణచే శ్రద్ధ, భక్తి, వినయము మొదలగు దివ్య గుణములెన్నియేని యలవర్చి, మనస్సును ఏకాగ్రత నొందించి దివ్యశాంతి నొనగూర్చు మహిమ నామమందే యున్నది. కావున భక్తిశ్రద్ధలతో నామమును స్మరింపవలయును.

(శిష్యుడు గురువుచే నెరింగింపబడిన విషయములవలన ఆనందమునుపొంది వినయముతో)

శి: గురువర్యా! భక్తియన నెట్టిది?

గు: భగవంతునియందుగల తీవ్ర ఆసక్తితోకూడిన ప్రేమయే భక్తి యనబడును. తల్లి బిడ్డను, పతివ్రత భర్తను ప్రేమించునట్లుగా భగవంతుని ప్రేమించవలయును. భక్తి సత్వగుణశోభితమై, ఫలాపేక్షారహితమై యుండవలెను. భక్తి లేక ఇతరసాధనలు ప్రయోజనము కానేరవు. రజస్తమోగుణయుక్తమగుభక్తి కంస, రావణాదుల భక్తివంటిదగుటచే తనకును ఇతరులకునుగూడ హాని కలిగించును. సత్వగుణశోభితమైన భక్తితో భగవంతుని ధ్యానించిన వైరాగ్య ముత్పన్నమగుటయేగాక ప్రకృతివాసనలు తమంతట జారిపోవును. పరిపూర్ణభక్తుడు ప్రకృతినిగూడ ద్వేషింపక భగవత్ స్వరూపముగనే భావించి మిక్కిలి ప్రేమించును. మరియు భక్తుడు నిష్కామ్యకర్మ చేయవలయును.

శి: స్వామీ! నిష్కామ్యకర్మ యననేమి?

గు: కర్మలయందలి కర్తృత్వమును వీడి, ఫలాపేక్షారహితుడై భగవత్సేవ యనుభావముతో సత్కర్మలను చేయుచు, భగవదర్పణ మొనర్చిన నదియే నిష్కామ్యకర్మ యనబడును.

శి: సత్కర్మలన నెట్టివి?

గు: సత్కర్మలన దానము, ధర్మము, పరోపకారము, దీనానాథుల సేవ మొదలైనవి సత్కర్మలనబడును. కర్మచేయక ఏప్రాణియు నుండజాలదు. మరియు ఏకర్మఫలము ఎప్పుడు అనుభవమునకువచ్చునో ఎవ్వరును చెప్పజాలరు గాన కర్మను సత్కర్మగా మార్చవలెను. ఇప్పుడు అనుభవించుచున్నదానినిబట్టి ఇదివరకు తనచే గావింపబడిన కర్మఫలమేగదాయని యూహింపవచ్చును. మనము ఇది

వరకు పండించిన ధాన్యమును ఇప్పుడు భుజించుచున్నాము. మరల ఇప్పుడు సేద్యముచేసినవి ముందు భుజించునట్లుగా మనము చేయు కర్మలనుబట్టి ఉచ్ఛ, నీచ జన్మలకు కారణమై అంతఃకరణమున అంకురరూపముగానుండి, వృత్తిరూపమై అంతఃకరణమును కలచి వైచుచు, మరియు కర్మలను సంచులకొలదిగా తయారుచేయుచుండును. ఈకర్మలనే ఆగామి, సంచిత, ప్రారబ్ధములందురు.

శి: గురువర్యా! భగవంతుని స్మరించువారికి కష్టములు కల్గునని ప్రతీతి కలదుకదా? సత్యమేనా?

గు: భగవంతుని స్మరించినను స్మరింపకున్నను కర్మానుసారముగా కష్ట సుఖములు కలుగుచుండును. జ్ఞాని కష్టసుఖములయందోర్పుకలిగి మనస్సు భగవదాయత్తము చేసియుండుటచే ప్రారబ్ధము అనుభవించుచున్నను ఆనందముగనే యుండును. వృత్తిరహితమై చిత్త శాంతి కలిగినదిగాన కర్తృత్వము లేమిచే అంతఃకరణరూపముగ నున్న ఆగామి సంచితములుగూడ లేనివేయగును జ్ఞాని అజ్ఞాని వలె ప్రకృతి మోహమున జిక్కడు.

శి: మోహమన నెట్టిది?

గు: తనకు సంబంధించిన కార్యములయందును, తనవారలయందును మిక్కిలిప్రేమయు, ఇతరులయందును, ఇతరుల కార్యములయందును నిరసనభావము కలిగియుండుటయే మోహమనబడును.

శి: ప్రేమలక్షణమెట్టిది?

గు: సత్యమైన ప్రేమయన భేదస్వభావములేక అందరియందును ఒకే ప్రేమను చూపుటయే. ఇట్టిప్రేమకల్గుట చాల దుర్లభము. అమిత భక్తి, పరిపూర్ణజ్ఞానము కలవారలకు ప్రేమ సులభము. ప్రేమ స్వభావులు ఇతరుల గుణదోషముల నాలోచింపక ప్రేమించుచు, ప్రేమస్వరూపుడగు భగవంతుని పొందగల్గుదురు. మోహము కల్మషపూరితమగుటచే బంధము, దుఃఖమును కల్గును. ప్రేమ

ఆనందదాయకమగుటచే విముక్తి, సంతోషమును కల్గును. సమత్వ ప్రేమకలవారు భక్తులనబడుదురు.

శి: ఏప్రయత్నముచే భక్తుడగును?

గు: భక్తుడగుటకు మొదట ఆర్తి కలుగవలెను. దుఃఖ కారణములగు ప్రపంచవస్తువులును, భార్య బిడ్డలకొరకు కడవలకొలది కన్నీళ్ళు కార్చుటకంటె నిజమైన తండ్రియగు భగవంతుని దర్శించుటకొరకు ఒక్క కన్నీటిబొట్టు కార్చుట మేలు. ఎట్లనగా మండువేసవిలో నిసుకయందు నిలబడినవాడు చెట్టునీడకొరకు తపించునట్లుగా పరితాపముతో భగవద్దర్శనమునకై నిజమగు ఆర్తికలిగినవారే భక్తులనబడుదురు.

శి: భక్తుని లక్షణములెట్టివి?

గు: భగవద్గీత యందలి ప్రమాణమును చూడుము.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రఃకరుణ ఏవచ
నిర్మమోనిరహంకార స్సమదుఃఖ సుఖఃక్షమీ॥ భ. ౧౩॥

తా॥ అన్నిప్రాణులను ప్రేమించువాడును, అన్నిప్రాణులయందు మిత్రభావముకలిగి దయతో నాదరించువాడు మమకారము అహంకారము లేనివాడు సుఖదుఃఖములలో సమానచిత్తముతో ఓర్పునొందువాడును భక్తుడనబడును.

శి: భక్తుడు భగవంతుని తనకోరికలు పూర్తిచేయుమని కోరవచ్చునా?

గు: భక్తుడు దుష్టములగు కోరికలు పూర్తిచేయుమని కోరరాదు, కాని ఇంద్రియముల జయించి ఆత్మవిచారణచేయు శక్తిని ప్రసాదింపుమనియు, త్రికరణశుద్ధిని కలుగజేయుమనియు ప్రార్థింపవచ్చును.

శి: త్రికరణశుద్ధి యనగానేమి?

గు: మనోవాక్కాయ కర్మలను మూటిని త్రికరణములందురు. దేవతలను, పెద్దలను పూజించుటయు, శుచియై సత్ప్రవర్తనకలిగి ఇతర ప్రాణులకు హానిచేయకుండుట శరీరతపస్సనబడును.

ప్రీతి విశ్వాసంబులతో కూడినదియు, ఇతరుల మనస్సు నొప్పింపనిదియు, యథార్థభాషణము, వేదానుకూల గ్రంథపఠనము, భగవన్నామ సంకీర్తనముచేయుట మొదలగునవి వాగ్రూప తపస్సనబడును.

మనస్సు శాంతిపూరితమై ఇతరుల మేలుకై యోచించుటయు, మనస్సును వాక్కుచే నియమించుటయు, ఆత్మచింతనతప్ప ఇతరవిషయములయందు మనస్సును పోనీయకుండుటయే మనస్సంబంధమైన తపస్సు.

భక్తుడు త్యాగశీలుడును పైనచెప్పబడిన లక్షణములను కలిగియుండవలెను. త్యాగమునుగురించి శిబిచక్రవర్తి దధీచి మొదలైన వారి చరిత్రలు చాటుచున్నవి.

శి: స్వామి! ఇంకనూ భక్తుని కర్తవ్యమేమి?

గు: భక్తుని కర్తవ్యమేమనగా తాను జీవాత్మ ఇంద్రియములకు రాజుగాన ఇంద్రియములను తనవశమందుంచుకొని కామమను శత్రువును జయించవలెను. ఇంకను భగవద్గీత ప్రమాణమును చూడుము.

శ్లో॥ ఏవంబుద్ధేః పరంబుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా
జహిశత్రుం మహాభాహో కామరూపం దురాసదమ్. భ. అ 3 43.

తా॥ బుద్ధికన్నను నగపడని యీఆత్మను తెలిసికొని బుద్ధిచేతనే యాత్మను నిశ్చలముచేసికొని యడపరానిదగునట్టి కామమను శత్రువును సంహరించవలెను.

జీవుని మనస్సు ప్రతిక్షణము ఆడించుచున్నను కొంతకాలమునకు జీవుడు వ్యతిరేకించిన మనస్సు ఏమియు చేయజాలకపోవుటయేగాక సూక్ష్మవిషయముల గ్రహించుటయు పరమాత్మైక్యమొందించుటకు సహాయకారిణి గూడ యగును. ఇట్టిబుద్ధినే శుద్ధబుద్ధియనియు, ముక్తికాంత యనియు అందురు. ఇట్టిస్థితికి 'అమనస్కత' యందురు.

శి: గురువర్యా! పరమాత్మ సగుణుడా, నిర్గుణుడా?

గు: భగవంతుడు సగుణ, నిర్గుణస్వరూపుడు.

శి: స్వామీ! సగుణ, నిర్గుణములు రెండును పరస్పర విరోధములు గాన ఒకనియందెట్లుండగలుగును?

గు: సగుణ నిర్గుణములు లేని పదార్థమే లేకున్నది. ఎట్లన అగ్నికి సగుణము వేడి. చల్లదనము నిర్గుణము. చక్కెరకు సగుణము తీపి. నిర్గుణము చేదు. అట్లే పరమాత్మయందు సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వ, సర్వనియామకత్వ, ఆనందత్వ, అఖండత్వము మొదలగు దివ్యగుణములు సగుణములు. జీవలక్షణములగు ఇచ్ఛాద్వేషము, సుఖము దుఃఖము, సంయోగ వియోగములు మొదలగునవి నిర్గుణములుగాన భగవంతుడు సగుణ నిర్గుణ స్వరూపుడని చెప్పబడును.

శి: గురువర్యా! భగవంతుని నామములు అనేకము సిద్ధపురుషులకు గూడ యున్నట్లు మహాత్ములు, గ్రంథములుగూడ చాటుచున్నవి గాన ఈవిషయమై వివరముగ ఎరిగింపవేడెద.

గు: భగవంతునియొక్క నామములే మహాపురుషులకు నుంచబడినవి. జగత్తునందలి నామములన్నియు భగవంతునకు గలవు

విష్ణుయన సర్వవ్యాపకుడని, బ్రహ్మయన సృష్టికర్త యని, ఈశ్వరుడనగా సర్వపాలకుడని, రామ యన సర్వజీవులను ఆనందింపజేయువాడు అనియు, కృష్ణయన క్రియాస్వరూపుడనియు నిట్లే పరమాత్మయొక్క ఒక్కొక్క శక్తినిగూర్చి ఒక్కొక్క నామము తెలుపును. ఈనామములుగల సిద్ధపురుషులు పరమాత్మ నుపాసించి సిద్ధినిపొందినట్టివారు దేవతలును, పరమాత్మ దేవదేవుడనియు గ్రహింపవలయును.

శి: కొన్ని నామములు ప్రాకృతికపదార్థములకుగూడ గలవు. అవి ఎట్లు సమన్వయపర్చుకొనవలయును?

గు: నీవు ప్రశ్నించిన విషయము బహుముఖ్యమైనది. 'గురు' అను శబ్దము పరమాత్మను వర్ణించు ప్రకరణమందున్నచో పరమాత్మను

వాచకమనియు, మానవుని కార్యములను వర్ణించు ప్రకరణమందు గురుశబ్దము భౌతికగురువాచకమనియు, మందులప్రకరణమందలి గురుశబ్దమునకు వైలుతుత్తమనియు గ్రహింపవలయును. అగ్ని, వాయువు మొదలగు నామములనుగూడ నట్లే గ్రహించవలయును. ప్రకరణమునుబట్టి అర్థముచేయనిచో అర్థము విరుద్ధమగును.

శి: స్వామీ! సగుణారాధన యననేమి ?

గు: ఒకటి విగ్రహారాధన, రెండు మహాత్ములకు పెద్దలకు, అన్న వస్త్రాదులిచ్చి సత్కరించుట అనునవి. సాకారపూజలు రెండువిధములు: ఉత్తమమానవులు అన్నముపెట్టిన తిని, వస్త్రమిచ్చిన కట్టుకొనెదరు గాన ఇట్టిపూజ ఉత్తమము. సాధకునకు విగ్రహారాధన, మహాత్ముల పటములు చూచినపుడు వారివలె తానుగూడ వారుపొందిన స్థితిని పొందుటకు ప్రయత్నించుటకు ఉత్సాహము కల్గుటకు భిన్నభిన్నమగు మనస్సు ఒకస్థానమున నిల్పుటకు అవసరము. విగ్రహారాధన చేయునపుడు విగ్రహమని భావింపక భగవంతుడు విగ్రహమందుగూడ యున్నాడు. కాన భగవంతునే ఆరాధించుచున్నానను భావముతో చేయవలయును. ఇట్లు చేయుచు మనస్సును అంతర్ముఖమునకు త్రిప్పి సర్వదా తన మనఃప్రవర్తనను పరిచూచుకొనుచు బ్రహ్మవిద్య నభివృద్ధిచేసికొనవలెను. మరియు తానుచేయు కర్మయంతయు భగవంతుని కర్పించుచు తన్ను పవిత్రునిగ చేయుమని వేడుకొనవలయును. పవిత్రత, ప్రీతి, అన్నిమార్గములకును ఆవశ్యకము గాన ఈరెండును భగవంతుని కరుణవలన మనకు తప్పక లభింపవలెను. సదాచారముకలిగి, నిరహంకారముతో భగవంతునివలె స్వార్థత్యాగులై పైన నుడివిన ధర్మానుసారము ప్రవర్తించుచు సదా భగవద్గుణానుభవము నభివృద్ధి నొందించుకొనువారు భగవంతుని కరుణకు పాత్రులగుదురు.

శి: భగవద్గీతయందు శ్రీకృష్ణుడు అనేకవిధముల నుడివినందువలన ఎట్లు సమన్వయపర్చుకొనవలెను ?

గు: శ్లో॥ నత్వేవాహం జాతునాసం । నత్వంనేమే జనాధిపాః

నచైవ నభవిష్యామి । సర్వేవయమతః పరమ్॥

తా॥ నేను, నీవు, ఈరాజులు, ఇదివరకును ఉన్నవారము, ఇప్పుడున్నారము, ముందుండుదుము, ఒకప్పుడును లేనివారముకాము, ఈ దేహములు పోయినను మనముందువారమే యగుదుమని శ్రీకృష్ణ పరమాత్మ నుడివియున్నారు.

గీత గొప్ప వేదాంతగ్రంథమును, ఉపనిషత్సారమును నై ఉన్నది గాన పైశ్లోకప్రకారము జీవుడు శాశ్వతుడని, అనాదియనియు గూడ సిద్ధమగుచున్నది. భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానులు కొన్ని వాక్యములు పరమాత్మనిపరముగను, కొన్ని యోగిపరముగను, కొన్ని ప్రకృతిపరముగను సెలవిచ్చియున్నారు.

పైనివ్రాసిన శ్లోకము యోగిపరముగ నుడివినదియే.

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్యసచరాచరమ్

మమ దేహే గుడాకేశయచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి.

తా॥ చరాచరములగు జీవరాసులతోకూడిన ప్రపంచము లన్నియు నాయందు చూడుము. అదిగాక నీవు చూడవలసినదంతయు చూడుము. ఈశ్లోకము పరమాత్మపరముగ నుడివియున్నారు.

తన శరీరము, ఈ గోచరించు జగత్తంతయు పంచభూతాత్మక మైనదేగాన, విభూతి యోగమందు శ్రీకృష్ణపరమాత్మ ప్రకృతిరూప ములన్నియు తన స్వరూపముగా నుడివియుండుటవలన దేహపరముగ నుడివినట్లు అర్థము గ్రహింపవలెను. మూడుతత్వములు తాను కలసియే యున్నారు గాన మూడువిధములుగ నుడివియున్నారు.

ఇట్టి భావమును గమనింపక భగవంతునకే అజ్ఞానముకలిగినదని నుడువువారి వాక్యము లెట్లున్నవన ఇల్లుకాలినను ముగ్గుచెడరాదను

నట్లున్నది. సర్వవ్యాపకుడును, ఆనందస్వరూపుడును నగు పరమాత్మ అజ్ఞానియై కష్టసుఖముల పాలైనాడనుట యెంతపని హాస్యాస్పదముగ నున్నది. మరియు తాను బిచ్చమెత్తికొనుచు పరిపూర్ణుడగు పరమాత్మ తానని నుడువుట ఎంత అసంభవము? పరమాత్మచేయు కార్యములలో తాను ఒక్క కార్యమైనను చేయజాలడు. ఈశ్వరత్వమును పొందిన మహాయోగియైనను తన మనస్సును ఒకవిషయముపై నేకాగ్రతపరచిన నదియే తెలియునుగాని ఏకకాలమున సృష్టియందలి సమస్తజీవరాసుల విషయములను గ్రహింపజాలడు. జీవాత్మ పరమాత్మతో ధ్యాన మందు కలసికొని ఎండయందు దీపమువలెను, తప్తాయఃపిండమువలెను నుండును. ఎండయందు దీపము తన ప్రకాశము వేరుగలేక ఎండయందే కలసిపోవును. తప్తాయఃపిండము అనగా ఎఱ్ఱగ కాలిన ఇనుపముద్ద యందు ప్రతిఅణువునందును అగ్ని వ్యాపించియుండియు బరువుగా ఎట్లున్నదో అట్లే జీవాత్మ పరమాత్మ ధ్యానమువలన లోపలవెలుపల ఆనందమను బ్రహ్మసముద్రమున మునిగినను, జీవభావ మవ్యక్తముగ నుండనేయుండునని రామకృష్ణపరమహంసగారి వాక్యము. అట్టి బ్రహ్మ సాక్షాత్కారము నొందినవారిని జీవగుణముల వీడినందున దివ్యపురుషు లనుట కర్హులగుచున్నారు. కావున చిదానందు డనవచ్చును.

ఆనందము ఒకటి, అనుభవించునది ఒకటి యని ఒప్పుకొనక తప్పదు. ఆరూఢునకు అనుభవమందు బ్రహ్మస్వరూపముతప్ప తదితర ములు గానరాకున్నను సూక్ష్మముగ నాలోచించిన జీవప్రకృతులు రెండును గూడియున్నవనుట తప్పదు. దైవధ్యానమువలన కొన్నిశక్తు లను పొందగలుగుటయు, పరమాత్మ ఆనందస్వరూపుడు గాన తాను గూడ ఆనందబ్రహ్మ యగును. అనగా సాధర్మ్యమునందు జీవబ్రహ్మ లొకటిగను వైధర్మ్యమందు భిన్నముగను నుందురు. ఎట్లనగా పటికి పటికిబెల్లము రూపమందొకటిగను రుచియందు భిన్నముగను ఉన్నట్లు,

జీవాత్మపరమాత్మలు నిరాకారమునందు, చేతనత్వమునందు సమానులు గను, సర్వజ్ఞత్వ, సర్వవ్యాపకత్వమునందు భిన్నులుగను యున్నారు.

శి: మీవాక్యములచే జీవబ్రహ్మ ప్రకృతులు అనాది యని తెలుచుండుటచే అద్వైతసిద్ధి యెట్లగును?

గు: అద్వైతమనగా పరమాత్మకంటె గొప్పవాడుగాని, ఆయనతో సమానుడుగాని లేరనిఅర్థము. ఆయనకంటె తక్కువలక్షణములు గల జీవప్రకృతులుండుటచేతనే అద్వైతుడను శబ్దముచే పరమాత్మ తెలియబడుచున్నాడు. ప్రజలు, రాజ్యము ఉండుటచేతనే రాజునకు రాజని పేరువచ్చును. ఆలాగుననే జీవులు ప్రజలుగను, ప్రకృతి రాజ్యముగను పరమాత్మ నియంతయై జీవప్రకృతుల నియమించు కారణకర్తయు నైయున్నాడు. బ్రహ్మవిచారణచేయు సాధకునకు మొదట ప్రకృతి, జీవుడు, పరమాత్మ యను మూడుతత్వములును గోచరించును. సాధన పరిపక్వమయినకొలది ప్రకృతి గానరాక జీవబ్రహ్మలు గోచరించుచుందురు. ఇట్టిస్థితిలో ద్వైతభావముండుటచే సవికల్పసమాధి యందురు. ఇంకను అనుభవము అభివృద్ధియగుకొలది తానున్నానను జ్ఞప్తికూడ లేక బ్రహ్మమందే అనుభవముతోనుండును. తన్నుమరచి నిర్వికల్పము నొందుటయే అద్వైతసిద్ధి యనబడును. ఇట్టిఅనుభవమునొందిన మహాత్ములు తమ బోధచే అనేకులను బ్రహ్మానందామృతమున ముంచివేయగల్గుదురు.

శి: గురువర్యా! జీవుడు స్వతంత్రుడా? పరతంత్రుడా?

గు: జీవుడు తన కర్తవ్యకర్మలు చేయుటయందు స్వతంత్రుడునూ, కర్మఫలమనుభవించుటకు పరతంత్రుడుగా నుండును.

శి: జీవుడు దేహమందొకచోట ఖిన్నుడై యున్నాడా? లేక విభుడై అంతట వ్యాపించియున్నాడా?

గు: ఏకదేశీయుగు జీవుడు పరిచ్ఛిన్నుడు. విభుడై దేహసంబంధమగు జాగ్రత, స్వప్నము, సుషుప్తి, మరణము, జన్మము మరియు

సంయోగ వియోగములు మొదలగు అవస్థలకు లోనుగాకఉండును. జీవుని స్వరూపము సూక్ష్మమైననూ వాని చేతనత్వము శరీరమంతట వ్యాపించియుండును.

శి: జీవునకు స్వాభావికశక్తులేమైన యున్నవా?

గు: జీవునకు స్వతః 19 శక్తులున్నవి. అవియేమన జ్ఞానేంద్రియ, పంచ తన్మాత్ర, పంచప్రాణ, అంతఃకరణ, చతుష్టయము మొదలగునవి. ఈశక్తులును ప్రకృతియొక్క స్వాభావిక శక్తులును సంబంధపడి నప్పుడే జీవునకు విషయగ్రహణము కలుగును.

శి: పరమాత్మసత్తచేతనే జీవులు సమస్తకార్యములు చేయుచున్నట్లు తమరు శలవిచ్చినారు. పరమాత్మ శక్తినీయకున్న జీవులు కర్మ చేయజాలరుకదా?

గు: పరమాత్మ స్వయంప్రకాశస్వరూపుడు. ప్రకాశించుటయే ఆయన స్వభావము. ఎట్లు సూర్యునివెలుతురులో జీవరాసు లొనరించు కర్మలతో సూర్యునికి సంబంధములేదో అదేవిధముగ పరమాత్మ శక్తిచేతనే జీవులు ఎట్టికర్మలు చేయగలుగుచున్నను పరమాత్మకు మాత్రము ఎట్టిసంబంధమునూ లేదు.

శి: సర్వమును బ్రహ్మమయమని అనేకులు నుడువుచుందురు. యదార్థమేనా?

గు: సమాధిస్థితిని బొందిన బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడు సర్వమూ బ్రహ్మమయముగా ఆనందించును. అయిననూ ప్రమాదములేదు. కాని ఆవాక్యము ఇతరులకు (అనగా) అజ్ఞానులకు చెప్పుటచే లోకమున హాని ప్రబలుచున్నది. పరిపూర్ణజ్ఞానము లేనివారు సర్వము బ్రహ్మమయమేనని వాచా వేదాంతము నుడువుచు కర్మ, జ్ఞానభ్రష్టులగుచున్నారు. బోధించునపుడు మూడుపదార్థములు అనగా (జీవ, బ్రహ్మ ప్రకృతుల) నిరూపణ తప్పకవచ్చును. అనుభవమునందు

మాత్రము జీవ, బ్రహ్మ లొకమై ఇరువురు సమత్వస్థాయితో బ్రహ్మ సముద్రమున మునిగి తేలుచుందురు. ఎట్లు బయలునందున్న సమస్త పదార్థములు అనగా ఇల్లుకట్టుట కవసరమగు సర్వసామానులు కట్టకపూర్వము, కట్టినవెనుక తిరిగి శిథిలమయి పారవేసిననూ బయలుగాక బయలునందే యున్నవో అట్లే జీవప్రకృతులు బ్రహ్మమందే యున్నను బ్రహ్మము తాముగాక తాము బ్రహ్మముగాక వ్యాప్యవ్యాపక సంబంధము గలిగియున్నవి. అవిద్యనుండి వెలువడి పరమాత్మజ్ఞాన నిమగ్నులయినవారు ముక్తాత్ములగుదురు.

శి: జీవన్ముక్తి విదేహముక్తు లననేమి?

గు: ముక్తియనగా ప్రకృతివాసనలనుండి విడుదల. జీవన్ముక్తు లన జీవించియుండగనే ముక్తినొందుట. దేహాంతమందు ముక్తినొందినవారు విదేహముక్తు లనబడుదురు. ప్రకృతివాసనల త్యజించి పరోపకారపరాయణులై బ్రహ్మానుభవమును పొందినవారే జీవన్ముక్తులు.

శి: జీవన్ముక్తునికి మనస్సు ఉండునా?

గు: జీవన్ముక్తునికి శుద్ధమగు స్వాభావికమనస్సు ఉండును. లేనిచో తన అనుభవములను శిష్యుల కెరిగింపజాలక యుండుటచే బ్రహ్మవిద్య అంతరించిపోయి యుండును. జీవన్ముక్తుడు ఏవిషయమాలోచించినను దానియందుగూడ బ్రహ్మస్వరూపమే గాంచును.

శి: జీవన్ముక్తుని మనస్థితి ఎట్లుండును?

గు: జీవన్ముక్తుని మనస్థితి శోకరహితమై, నిరోత్సాహమై, నిశ్చలమై, దేశ, కాల, వస్తువులను ద్వేషింపనిదై,, అభ్యాసపాటవమున దేహేంద్రియములు తమ స్వకార్యములు చేయుచుండ ఈపని చేసితినను అహంభావముగాని చేయనైతినను విచారముగాని లేక తటస్థముగ ఊరకుండును.

శి: జీవన్ముక్తునకు సంకల్పముండునా ?

గు: జీవన్ముక్తునకు సత్ సంకల్పముండును. సత్ సంకల్పమువలన సత్కార్యముల నెరవేర్ప సమర్థుడైయుండును.

శి: విదేహముక్తులు తిరిగి అవతరింతురా ?

గు: లోకమునందు అధర్మము ప్రబలినచో విదేహముక్తులు అవతరించి ధర్మస్థాపనచేసి పోవుచుందురు. రామకృష్ణాద్యవతారములన్నియు అట్టివే. వారికి కర్మబంధములుమాత్ర ముండవు. రామునియొక్క సత్యనిష్ఠ, పితృవాక్యపరిపాలనము ప్రజల కిష్టములేనందున భార్యాతిరస్కారమొనర్చుటచే త్యాగశీలములు, ధర్మనిష్ఠయు మనము నేర్చుకొనవలయును.

శి: పరమాత్మ అవతరించునా ?

గు: అవతరించుట యన మోక్షమునుండి ప్రకృతిలోనికి దిగుటయని అర్థము. పరమాత్మ సర్వవ్యాపకుడై యుండ ఒకచోట లేకుండినగదా అవతరించునా యను ప్రశ్న కవకాశము.

శి: దుష్టశిక్షణకొరకు అవతరించడా ?

గు: దుష్టుల శరీరనిర్మాణమునం దవతరింపకనే నిర్మించి వారలద్రుంచు సమయమునమాత్రమె నవతరించును. ఎట్లన గాజుసామానులు చేయుట కష్టమైననూ పగులగొట్టుట సులభమే. అట్లే దుర్మార్గుల జన్మింపచేయు శక్తిగల పరమాత్మకు ద్రుంచుటకును శక్తిగలదు. అయితే ధార్మికులగు పురుషులద్వారా ధర్మస్థాపన చేయబడుచుండును.

శి: రామకృష్ణాద్యవతారముల నుపాసింపవచ్చునా ?

గు: కొంత ఏకాగ్రత కలుగువరకు ఉపాసింపవచ్చును. భౌతికవిద్యయందు అక్షరాభ్యాసమెట్టిదో ఆధ్యాత్మికమార్గమందు ఇదియును అట్టిదే. నెమ్మదిగా బాలుడు ఒక్కొక్కతరగతి అభివృద్ధిచెందునట్లే బ్రహ్మవిద్యయందుగూడ ఆరామతత్త్వము కృష్ణతత్త్వము తనయందు

సహా సర్వత్ర దర్శించుట అనుభవముపొందుట పరిపూర్ణమన బడును. అనగా ఖండోపాసనతో ప్రారంభమై అఖండోపాసనగా మారవలెను.

శి: యోగసిద్ధినొందినవారుగూడ అనుష్ఠానముచేయవలెనా ?

గు: తప్పకచేయువలెను. లేనిచో తనకు తెలియకయే జ్ఞానము క్షీణించును. కావున ఎంతటివారైనను తప్పక అనుష్ఠానము చేయవలెను. అట్టివారు అభ్యాసబలముచే అప్రయత్నముగనే ధ్యాననిమగ్నులగుచుందురు. కారణమేమన జీవాత్మకు స్వతః ఆనందములేదు. దేహమునకు భౌతికాహారమెట్లు అవసరమో అట్లే జీవాత్మకు బ్రహ్మానందమను ఆహారము అవసరము. బద్ధులకు విషయానందము, ముక్తులకు బ్రహ్మానందము ఆహారమని గ్రహించుము.

శి: అట్లగుచో ఆనందమనునది ఒకటియేయైన బ్రహ్మానందముకొరకు ఏల ప్రయత్నించవలెను ?

గు: ప్రపంచసుఖములందలి ఆనందమెట్టిదన ఎట్టిభోగములను అనుభవించినను, ఎట్టిపదార్థములను తినినను, అనుభవించుకాలమందే గాని శాశ్వతానందము గానరాదు. ఆ ఆనందమయినను అనుభవించునప్పుడు మరుచటిరోజున కీభోగము లుండవేమో యను భీతిచే ఆ కొలదిఆనందముగూడ బొందుట కవకాశముండదు. బ్రహ్మానంద మట్టిదిగాదు. అనుభవించినకొలది అమృతధారగా ప్రవహించును. ప్రమాణము చూడుము.

౧౪॥ తద్ధేతువ్యపదేశాచ్చ.

అర్థము.

బ్రహ్మానందము ప్రపంచసుఖము లన్నింటికంటె అతీతమైన దని చెప్పుటకు కారణము వేదములందు యుపదేశించబడియున్నందు వలన, మరియు—

"ఏష హ్యేవానన్దయతి" తైత్తిరీయములో పరమాత్మ ఆనం దాతయని చెప్పబడియున్నది. కాబట్టి పరమాత్మ నిత్యానందస్వరూపుడని గ్రహించి ఆయనను పొందుటకే సాధనచేయవలెను.

శి: పరమాత్మను ప్రకృతివస్తువులం దుపాసింపగూడదా ?

గు: ప్రకృతివస్తువుల నుపాసింపరాదని శ్రుతులయందు చెప్పుటవలన ప్రకృతివస్తువులన్నియు త్యజించి పరమాత్మనే ఉపాసింపవలెను.

శి: పరమాత్మ నెచ్చట ఉపాసించి దర్శించవలెను ?

గు: ప్రకృతిమయమగు బాహ్యవిషయము లన్నిటినుండి వేరై స్వస్వరూపమగు జీవాత్మయందే పరమాత్మ నుపాసించి దర్శింపవలెను. కారణమేమన జీవుడు చేతనుడు, నిరాకారస్వరూపుడు. అట్లే దేవుడుగూడ చేతనుడు, నిరాకారస్వరూపుడు. వ్యాప్యవ్యాపక సంబంధము కలిగియుండుటచేతను మరియు జీవాత్మయందు పరమాత్మ అంతర్యామియై యతిసామీప్యమున నుండుటచేతను జీవబ్రహ్మలయొక్క యునికి అనగా ఆకృతులు సమానమైయుండుటచేత జీవాత్మయందే పరమాత్మ నుపాసించి దర్శింపవలెను.

శి: స్వామీ! ఇప్పుడు మీరు నుడివిన వాక్యములచే జీవబ్రహ్మ లొకటి యని యర్థమగుచున్నదికదా? ఇరువురకును గల భేదమేమి ?

గు: దేవుడు సర్వవ్యాపి, జీవుడు ఏకదేశి; దేవుడు సర్వజ్ఞుడు, జీవుడు కించజ్ఞుడు; దేవుడు సర్వశక్తివంతుడు, జీవుడు స్వల్పశక్తివంతుడు; దేవుడు సృష్టికర్త, జీవుడు సృష్టియందు తన కర్మఫలభోక్త; దేవుడు నిత్యానందుడు, జీవుడు క్షణికానందుడు; దేవుడు స్వతంత్రుడు, జీవుడు పరతంత్రుడు అనగా ప్రకృతియందు బంధింపబడినవాడు కనుక 'భేదవ్యపదేశాచ్చ' అను శాస్త్రానుసారముగ దేవుడు కంటె జీవుడు భిన్నుడై యున్నాడు.

శి: "అథోఽధరమంతరం కురుతే అథతస్య భయంభవతి ద్వితీయంభవతి" అను బృహదారణ్యక వచనప్రకారము బ్రహ్మయందును జీవప్రకృ

తులయందునను భేదము చేయువానికి తనకంటె ఇతరులుండుట వలన వారిచే నెప్పటికేమి కలుగునో యను భయము గలుగును గదా? మీా అభిప్రాయమేమి ?

గు: దీనికర్థమిదికాదు. ఏమానవుడు పరమేశ్వరునియొక్క ఆజ్ఞకు వ్యతిరిక్తముగా నడచునో అతనికి పరమేశ్వరునివలన భయముకలుగును. తనకు భగవంతునకును ఎట్టిసంబంధమును లేదనుకొనువానికి భయముకలుగునుగాని తనయందునహా సర్వత్ర భగవంతుని దర్శించి ఆత్మానుభవమును పొందిన యోగిపుంగవునకు ఎట్టిభయమును లేదు. సమాధియందు జీవబ్రహ్మైక్యసిద్ధియుండిరనిన జీవుడు దేవునిధర్మముల ననుసరించెనని భావము.

శి: సర్వవ్యాపకమగు పరమాత్మయందే ముక్తులు, బద్ధులు గూడ యున్నారుగదా! వారిరువురకును గల భేదమేమి?

గు: బిడ్డా! ముక్తులు, బద్ధులుగూడ బ్రహ్మమను సముద్రములోనే యున్ననూ బద్ధజీవులయొక్క బుద్ధులు అజ్ఞానమను తెరచే మూయబడి ప్రకృతియందలి విషయములను గొలుసులచే బంధింపబడిన కారణముచే ముల్లుగ్రుచ్చ సందులేక నిండియుండిన పరమాత్మను తెలిసికొని గ్రహించి అనుభవింపజాలకున్నారు. సముద్రమునందు వేయబడిన వలలయందు చిక్కుకొన్న చేపలవంటివారు, బద్ధజీవులు వలలకు బయట స్వేచ్ఛగావిహరించు చేపలవంటివారు ముక్తాత్ములు. ముక్తాత్ములు పరమాత్మను తెలిసికొని గ్రహించి దర్శించి ఆనందించి తామే బ్రహ్మముగ అనుభవించుచున్నారు.

శి: స్వామీా! తమబోధచే నాకుగల సందేహములు చాలవరకు తీరినవి. ఇంక కొలదిసందేహములు మాత్రము గలవు వానినిగూడ నాయందనుగ్రహించి విశదపర్చగోరుచున్నాను.

గు: నాయనా! నీకెట్టి అభ్యంతరమును లేదు. వినువారు ప్రశ్నించినగాని తిరిగి సమాధానమురాదు. ఎట్లు దూడ చేపినగాని పొదుగు

నుండి పాలురావో అట్లే మరలమరల ప్రశ్నించిననే చక్కని సమాధానములు బయల్వెడలును.

శి: పరమాత్మ సృష్టికర్త యంటిరిగదా సమస్త కార్యములు జీవులే చేయుచు అనుభవించుచున్నట్లు గానవచ్చుచున్నది. కర్త పరమాత్మయైయుండ పనులు వేరేల జేయవలెను?

గు: పరమాత్మ రకరకముల పదార్థములు నిర్మించి జీవులకు దానము చేసి యున్నాడని ఇదివరలో తెలిపియుంటినిగదా! పదార్థమును నిర్మించినది పరమాత్మ. దానిని మార్చుచు అభివృద్ధిచేసికొనుచు ఫలితమును పొందుచున్నవారు జీవులు. జీవులకు సమస్తపదార్థములు నభివృద్ధినొందుటకు శక్తినొసంగుచున్నది పరమాత్మయే. బియ్యము, ప్రత్తి మొదలగు పలురకముల పదార్థములను పరమాత్మనిర్మించినందున జీవులు వానిని మార్చుచు ఉపయోగించుకొనుచున్నారు.

శి: బంగారము నగలుగను, మన్ను కుండలుగను, మారునట్లు పరమాత్మయే ఈ నానావిధ జగద్రూపముగ మారుననువాక్యము యదార్థమేనా?

గు: బంగారము, మన్ను వాటంతటవి నగలు, కుండలు కాజాలవు. వాటిని చేతనులగు జీవులు నగలుగను, కుండలుగను మార్చుచుందురు. అయితే కుండలకు మట్టి, నగలకు బంగారము ఉపాదాన కారణము. వీటినిమార్చు జీవులు నిమిత్తకారణకర్తలు. పరికరములు ఉపయోగించువారు సాధారణ కారణులనబడుదురు. బంగారమునకు నిమిత్తకారణకర్త, సాధారణకారణ కారణులు ఎట్లు అవసరమో అట్లే జడరూపమగు ప్రకృతిని నిమిత్తకారణకర్తయగు పరమాత్మ ఉపయోగించువారగు సాధారణ కారణులను జీవుల కొఱకు రకరకముల దేహములు, పదార్థములు, నిర్మించుచున్నా

డని అనిననే ఈ ఉపమానమునకు సరిపోవును. పరమాత్మయే ప్రకృతిగా మారెననిన కంసాలియే నగలు అయిపోయినన్నట్లుండును. బంగారముయొక్క లక్షణము, నగలయందు గానవచ్చిన రీతిగా ప్రకృతి లక్షణము పరమాత్మునియందును, పరమాత్మ లక్షణము ప్రకృతియందును గానవచ్చిన ఈవిషయము నమ్మవచ్చును. అట్లుగాక పరమాత్మ చేతనుడు, ప్రకృతి జడము, పరమాత్మ నిరాకారుడు, ప్రకృతి సాకారము, పరమాత్మ ఏకరసుడు, ప్రకృతి పరిణామిని, పరమాత్మ అఖండుడు, ప్రకృతి ఖండఖండములు, పరమాత్మ ఆనందరూపుడు, ప్రకృతి దుఃఖదాయిని. ఇట్లు ఒకలక్షణముండైనను కలువక వ్యతిరేకముగనున్న పరమాత్మయే ప్రకృతిగా మారునన్న విషయము ఎట్లు నమ్మవలెను? అనగా నమ్మకూడదు.

శి: స్వామి! మీబోధచే సందేహములు తీరినవి. తమ పాదతీర్థము తీసికొని ఆనందింపగోరుచున్నాను.

గు: నాయనా! నీకంటె తెలిసినవాడను గావున నీవు ధన్యుడవగుటకు బ్రహ్మవిద్యనుపదేశించితిని గాన కృతఘ్నుడవుగాక కృతజ్ఞతతో భక్తిపూర్వక నమస్కారమొనరించుటయే చాలును గాని మరికి పాదతీర్థము త్రాగుట అనుచితము. ఇంకను గురుబోధ యను జ్ఞాన తీర్థము త్రాగుచు సదా హంససూత్రముతో సోహం అను మంత్రము ను అనుసంధించి నీయందే కోటిసూర్యప్రకాశముతో వెలుగుచున్న పరమాత్మను ధ్యానింపుము.

శి: తమవంటి నిరాడంబరులగు గురువుల నెచటను గాంచజాలను. ధన్యుడనైతి నని (బ్రహ్మానందముతో రెండుచేతులు జోడించి) మహాత్మా! తమకెంతయేని కృతజ్ఞుడను. ఇంక ముఖ్యవిషయముల నెరింగింపుడు.

గు: నాయనా! ఇదివరకే సమస్తధర్మములు నుడివియుంటిని. సమస్త భూతములయందు పరమాత్మను, పరమాత్మయందు సమస్త భూత

ములును దర్శించుచు భూతదయాపరుడై జగత్తంతయూ భగవత్ సృష్టి గావున సేవొనరించు కర్మయంతయు నిష్కపటముతో భగవత్సేవగా భావించి చేయుచుండిన భగవత్కర్మ మగును. అనగా భగవద్గీతలో చెప్పబడిన యజ్ఞరూపముగా మారును. మరియు నాచే వివరింపబడిన ధర్మానుసారివై భగవదనుభవమును వృద్ధినొందించుకొనుచుండిన నీవే బ్రహ్మము; బ్రహ్మమే నీవుగా అభేద స్థితి యేర్పడును. అజ్ఞానావస్థయందు దేహమే తాననుకొనురీతిగా ముక్తావస్థయందు బ్రహ్మమె తానుగ అనుభవించును. కాని దేహాభిమానమందు దేహము తానుగాక యున్నట్లు ముక్తావస్థయందు బ్రహ్మమును తానుగాక బ్రహ్మమే దేహముగనుండి ముక్తి సుఖమనుభవించును.

ఇట్లు శిష్యుడు గురుకటాక్షముచే ఆత్మబోధనొంది తన యథాస్థానమున కేగి అభ్యసించి కొలదిమాసముల తరువాత తిరిగి గురుదర్శనార్థమేగి దండప్రమాణంబు లాచరించి గురువుతో నిట్లనియె.

శిష్యుడు: గురువర్యా! తమ దివ్యోపదేశప్రకారము కొంతవరకు సాధనచేసి తిరిగి మిమ్ము దర్శించి పోవుదమని వచ్చితిని. నాయందను గ్రహముంచిఇంకను ఆవశ్యకవిధానంబుపదేశించి కృతార్థునిచేయప్రార్థన. కొంతవరకు నా మనోమాలిన్యము తొలగినదని శిష్యుడు విన్నవించెను.

గురువు: తాను బోధించినవిద్య సఫలమగుచుండుటకు గురువెంతయు సంతసించి తగిన ప్రియశిష్యులకు బోధించుటకన్న తమకు వేరే ఆనందము లేదని హృదయపూర్వకాశీర్వాదమొనర్చి కూర్చుండ నియోగించి ప్రశ్నింప ననుజ్ఞ యొసంగెను.

శి: భగవత్తత్త్వము సర్వత్ర వ్యాపించియున్నను సర్వుల కేల సులభముగా గోచరమగుటలేదా యని నాసందేహము.

గు: జీవులకు పుట్టుకతోడనే రాగద్వేషాదు లేర్పడుటచే ప్రకృతివశులైన కారణముచే ప్రకృతికన్న అతి సమీపమునందున్నను భగవ

త్త్వము గోచరమగుటలేదు. ఎట్లన కాటుక కనులయందేయున్నను కాటుకనుచూచుటకు పరిశుభ్రమగు అద్దమవసరముకదా. ఇంకను వెలుగు అద్దము కదలకుండగను ఉండవలెను. అదేవిధముగ తన యందే నిండియున్న పరమాత్మ దర్శనమునకు మనస్సనెడి దర్పణము స్వచ్ఛముగను, జ్ఞానమనెడు వెల్తురుకూడ ఆవశ్యకము. పరిశుద్ధమయిన బుద్ధి గుహాయందే భగవదనుభవము పొందవలసి యున్నది.

శి: దయామయా! అనుభవముచేతగాని ఆత్మను గాంచ శక్యముగాదా?

గు: అతిసూక్ష్మమగుటచే మనోనేత్రముచేతనే గ్రహించ శక్యము. చూడుము. మధురపదార్థముల విషయము అనుభవైకవేద్యమే కదా. తీపిని నీవు ఎట్లు వర్ణించగలవు. తీయగానున్నదనిమాత్రమే గదా! ఇంద్రియాతీతమగు ఆత్మానుభూతికూడ చెప్పుటకు, చూపుటకు శక్యముకాదు. అయితే మనస్సును భక్తియను అమృతపానముచేతను, ఈశ్వరార్పణ మొనర్చు నిష్కామ్యకర్మ చేతను, విమర్శనాజ్ఞానముచేతను, నెమ్మదిగా ఆత్మానుభవమును పొందవచ్చును. చేయబడు కర్మ కపటరహితముగను, ప్రీతిపూర్వకముగను, శ్రద్ధాసహితముగను చేయుచు, కర్మఫలమును భగవదర్పణము చేయవలయును. ఇదియే కర్మయోగ రహస్యము.

శి: హేప్రభూ! కర్మచేయుచు అకర్మస్థితినొందుట ఎట్లో వివరింపుడు.

గు: పైనచెప్పినప్రకారము అనగా అన్నదానము చేయుటవలన ఇంతిఫలము కల్గునను ఆశలేక దానముచేయుట తనవిధియనియు, చేయబడుచున్న పనియందు హృదయమును పవిత్రభావముతో నిలిపి చేయుటకే కర్మయందు వికర్మను కలుపుట యనబడును. ఇంక అకర్మస్థితి అనగా కొంతకాలమిట్లు కర్మచేయుచు ఫలము ఈశ్వరార్పణ మొనర్చిన కర్మ వికర్మల మేళనముచే జ్ఞానాగ్ని ప్రజ్వలించి

హృదయమాలిన్యము భస్మమై అహంకార కర్తృత్వములు నశించును. కర్మచేయును గాని ఎట్టి అహంభావము అలసట యుండదు. కర్మచేసినను చేసినట్లే భారమనిపించదు. సత్కర్మ సహజమగును. కావున సర్వశాస్త్రములు ఈశ్వరప్రీతికరమైన కర్మ చేయుమనియే శాసించుచున్నవి.

శి: స్వామీ! బ్రహ్మవేత్తకు శబ్ద స్పర్శ రూపరసగంధముల క్రియ లెట్లుండును?

గు: అట్టిమహాత్ములకు మనస్సు ఆత్మవైపు మరలినందున ఇంద్రియములచే గ్రహింపబడు శబ్దము మొదలగునవి గోళకములవరకే చేరి దానిలోనే లయమైపోవును. ఆకారణముచే వినుట, చూచుట మొదలగు కార్యములచే హృదయమున నెట్టి వికారములుత్పన్నమొనర్పజాలవు. ఇదియే లయయోగము. అద్వితీయానుభవమందు వినబడునది, చూడబడునది, తినబడునది సర్వము బ్రహ్మమాత్రముగనే అనుభవించుచు, తన్మయత్వము నొందియుండును. ఈ స్థితిలో పంచభూతముల కార్యములు వానియందే లయమగుటచే పంచభూతగుణములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములుగూడ ఆత్మకు భిన్నముగానుండక ఏకమై ఇంద్రియము లన్నియు తేజోవంతములైయుండునని ఉపనిషద్వాక్యము. ఇట్టిస్థితి లభించుట కడు దుర్లభము.

శి: అయిన స్వామీ! ప్రతివ్యక్తియు ఇట్టి అద్వితీయానందసుఖముకొఱకేల ప్రయత్నింపకున్నారు? బ్రహ్మవిద్యాపరిభావమును వివరింపుడు.

గు: నాయనా! ప్రపంచమునందలి సర్వపదార్థములు కనులకు గోచరించి మన మనస్సుల నాకర్షించి లాగుచున్నవి. శబ్దజాలము, రూపములు హృదయమందు క్రోధ, ఉద్రేక, ఆనందములు కలుగజేయుచున్నవి. భగవత్తత్వమో కనులకు గోచరింపక, చెవులకు విన్ప

డక ఊహాతీతముగ నున్నందున తెలియ శక్యముగాకున్నది. జీవి ప్రకృతివలన కలుగు అనేక దుఃఖములచే విసుగుచెంది, ఈశ్వరుని శరణుజొచ్చి ఇంతవరకు శాంతినొందక తాను బాధనొందుటకుగల ప్రకృతిపైగల మోహమను మాలిన్యమును, భగవద్భక్తి యను అమృతపు నీటిచే హృదయమును కడిగికొని, సూక్ష్మముగనున్న భగవంతునకు హృదయపుష్పమర్పించి, శుద్ధమగు స్వయంప్రకాశాత్మయే తానని ఎఱింగి నిత్యశాంతిని పొందును. ఇక బ్రహ్మవిద్యా ప్రభావమును వినుము. అణువు మొదలు బ్రహ్మపర్యంతము గల సృష్టిలో లోకలోకాంతరములయందలి ఆనందములన్నియు పోల్చినను శాశ్వతానందము గన్పింపదు. బ్రహ్మానంద మనుభవించెడివారిని భ్రమజాలము వశపరచుకొనజాలదు. ఇదియుకాక ఆత్మనిష్ఠయందు సంకల్పరహితమై ఒక్క క్షణకాలముండినవారికి సర్వతీర్థయాత్రల, సర్వయజ్ఞాదుల, ఇంకను అనేక పుణ్యకర్మ లాచరించువారలకన్న ఎక్కువ ఫలితమునొందుదురని శాస్త్రప్రమాణములు కలవు.

శి: స్వామీ! ఈశ్వర విశ్వాసమును దృఢపరచుకొనే ఉపాయము అనుభవపూర్వకముగా బోధింపుడు.

గు: నీమనస్సు నీవిచటనుండగనే ఎచ్చటెచ్చటికోపోయి వచ్చుచుండును. మనస్సు ఎందెందు తిరిగి ఏమేమి గాంచివచ్చినది నీవిచటనుండియే మనస్సున చూచుచున్నావుకదా! నీమనస్థితిని తెలిసికొనుచుంటివే అదే యాత్మ అనగా నీవు మనస్సునకు రూపము లేకున్నను ఉన్నదనిమాత్రము తేలును. దేహము మొదలు బుద్ధివరకు గల ఇంద్రియములన్నియు ప్రకృతి తత్త్వములనియు, వీనిని తెలిసికొనునదే జీవాత్మ, ఈ జీవప్రకృతులను నియమమందుంచెడిదే పరమాత్మగా తెలియుము. పరమాత్మ నియమము తప్పించ శక్యముగానిది.

ఆయన నియమమునకు ఉ॥ సముద్రము రవ్వంత మేర మీరకయు, సూర్యచంద్రాదుల గతులు రవ్వంతయేని మేరమీరకయు, వాయువు సదా వీచుటయు, భూమి సర్వము భరించుచుండుటయు జరుగుచున్నది. ఇంకను భూమియందే షడ్రుచులు గలవు. కొలది కొలది దూరమునే నాటిన వేప, మిరప, చెఱకు, వగరు చప్పనతో కూడియున్నవియు, అన్నియు భూమినుండి ఆయారకముల అణువులను వాటికి సంబంధించిన వృక్షములు లాగుకొనుచుండును. ఇదంతయు పొద్దుతప్పక ఏశక్తిచే జరుగుచున్నదో అదియే పరమాత్మ.

మానవులు కర్మలొనర్చి అనుభవించుట కిష్టపడకున్నను బలవంతముగా అనుభవింపజేయుచున్నదే పరమాత్మ. ఏజీవి మాయా చక్రమునుండి దాటగోరునో ఆజీవి ఈశ్వరానుగ్రహమును సాధించవలయును. ఈశ్వరున కన్నిజీవులయందును అనుగ్రహామే. అయినను ఎవడు తనవలె ఫలాపేక్ష అహంకారములేక సత్కర్మలు చేయునో వానియందు ఈశ్వరానుగ్రహము ప్రసరించును. తండ్రి కనుకూలముగ ప్రవర్తించుచు, తాను చేయు పనులలో పాల్గొను పుత్రునియందు కరుణగల్గియుండును. తనకెట్టిప్రయోజనము లేకున్నను భగవంతుడు ఎండకాపించుట, గాలివీచుట, నీటి నావిరిగా మార్చుట సృష్టిస్థితి లయముల చేయుటయు ఆయనచే చేయబడు యజ్ఞరూపకర్మ జరుగుచునే యున్నది.

శి: స్వామీ! అయితే ప్రతికర్మయు భగవంతుడే చేయుచున్నాడా? అట్లగుచో అన్నిటికి ఆయనయే కర్త కావలసియున్నదికదా?

గు: నాయనా! మనసంగతి చూతుము. నీవు ఆత్మవు. నీవు దేహామందుండుటవలననే శరీరము పనిచేయుచున్నది. అట్టిచో నీవు కర్తవు. కాని దేహామే పనులొనర్చుటచే దేహామే కర్త. నీవు ఏమియుచేయనందున అకర్తవు. దేహాము కర్త అయినపుడు ఆత్మ అకర్తగను,

ఆత్మ కర్తఅయినపుడు దేహము అకర్తగనుండును. భగవద్గీతలో కర్మయందు అకర్మ, అకర్మయందు కర్మను చూడమనుభావమిదియే. భగవత్తత్త్వమంతట నున్నమాత్రమున నే ప్రకృతి చైతన్యవంతమై జగద్వ్యాపారమంతయు నడచిపోవుచున్నది. జగద్వ్యాపారము చైతన్యశక్తివలననే జరుగుటచే పరమాత్మ కర్తగను, తానేమియు చేయక ప్రకృతియే చేయుటచే ప్రకృతి కర్తగను, తాను అకర్తగను ఉన్నట్లు ఊహించవలెను. ఎవనికి కర్మచేయుటచే శ్రమగాని, అహంకారముగాని కలుగక ఏమాత్రమైన గర్వ, భేదభావములు లేక నిర్మలముగనుండి చేయదగినది చేయుచుండుటయే అకర్మసిద్ధి నొందినవాని లక్షణము.

శి: అకర్మసిద్ధుని ఆశయమెట్లుండును ?

గు: తండ్రీ! ఇక చెప్పుచున్నాను వినుము. అభ్యాసకాలమున ఒక్కొక్క దివ్యగుణము మనస్సునకు పట్టించుకొనుటయు, అట్లు నడచుటకు ప్రయత్నము చేయుటయు జరుగుచుండును. అభ్యాసము పండి నపుడు అప్రయత్నముగా సహజముగా దయా ధర్మ సత్య ఆనంద లక్షణములు నిండియుండును. భగవానునకు ఔరసుడుగా వీనికి లభించిన సంపత్తు ఈ అయిదు దివ్యలక్షణములును, ఇంక సృష్టిస్థితి లయాది అనంతశక్తిసామర్థ్యము లెన్నియో పరమాత్మయం దున్నను వీనికిరాజాలవు. జరిగిన చరిత్రలవలన ఈ విషయము బోధపడును. మహాపురుషులుగూడ అష్టసిద్ధులను ఉపయోగించక నిరాడంబరులై జీవితయాత్ర పరమపూజ్యముగ గడుపుట గాంచు చున్నారము. అట్టిమహాత్ముల జీవితములు లోకమున కాదర్శ ప్రాయములు. కావున ఉత్తములైనవారు లోకవిరుద్ధముగ మాట్లా డకయు, విరుద్ధకార్యములొనర్పకయు తాను ఎడతెగని సత్కర్మ లొనర్చుచు ఇతరులచేత చేయించుచు లోకమానవులను కర్మనిష్ఠు లుగా, కర్మవీరులుగా తయారుచేయవలయును. ఈ విషయము

కృష్ణపరమాత్మ ఇట్లు నుడివెను. 'తెలిసినవారేమార్గమున నడ తురో తెలియనివారు నట్లే చేతురు. కావున అజ్ఞానదశయందు జ్ఞానార్థము కర్మచేయవలెను. జ్ఞానముకల్గిన ఇతరుల మేలునిమిత్తమై సత్కర్మ చేయవలెను.

శి: స్వామీ! భగవదనుభవము పొందినవాని ఆచరణ ఎట్లుండవలెను?

గు: ఈవిషయము నీకు తెల్పుటకెంతయు నుత్సాహముగనున్నది. భక్తి కల్గుటకు ఆర్తిచే తనకు భక్తిలేదేయను నిర్వేదము కల్గించుకోవలెను. భక్తులచరిత్రిలు ప్రేమతో చదువుచు, ఆయాభక్తుల ఉదారభావ ములు తాను మనస్సున కలవరచుకోవలెను. ఇంకను భాగవత రామాయణాది గ్రంథపఠనచే భక్తి అభివృద్ధిచెందును. ఆపిమ్మట భగవద్గీత నిత్యము చదువుచు దానిభావములు అవగాహనచేసికొని క్రియారూపము నొనర్చుచుండుటయు, సందేహ విచ్ఛేదమునకై ఉపనిషదర్థమును పెద్దలచే గ్రిహించవలెను. ఇట్లొనర్చగా భగవ ద్భావనయందు నిలకడకల్గును. అయితే పని పూర్తికాలేదు. భక్తి యోగమందలి భక్తుని లక్షణములు ఒక్కొక్కటిగా క్రియా రూపకమొనర్చి తాను ఆ దివ్యలక్షణములతో నైక్యముకావలయును. ఈవిధముగా నడకరాని బాలుడు కష్టపడి ప్రయత్నించగా నడక సహజమగునట్లే దయాధర్మసత్యములు సహజముకావలయును. పై దివ్యలక్షణములతో నైక్యమై దేహయాత్రి గడిపెడివాని స్థితినే అతీతమనియు, స్థితప్రజ్ఞ యనియు గీతామాత పేర్కొన్నది. ఇట్టి వాని సమస్తఇంద్రియములు భక్తిచేతను, సేవచేతను, ఆత్మజ్ఞానము చేతను భగవంతుని వైపునకు మరలినందున సర్వేంద్రియములు మనస్సుతోసహా తేజోవంతములగునని ఉపనిషద్వాక్యము.

శి: తమరు కేవలము అనుభవైకవేద్యములగునట్టి భావముల బోధించు చున్నారు. చాల ఆనందముగనున్నది. మహనీయునియొక్క ఆశయములింకనూ ఎట్లుండును?

గు: యదార్థముగ భగవద్భక్తులైనవాని ఆశయములు చాల ఉదార ముగను విశాలముగు రాజబాటవలెను యుండును. ఈవిషయమును ఆరుతరగతులుగా బోధించెదను.

సామాన్యమానవుని దృష్టి తనయొక్కయు, తన సుఖకారకులగు భార్యాపుత్రాదుల యెడలనే, అనగా అట్టివారొనర్చు పనులన్నియు తన సుఖనిమిత్తమే చేయుదురు. ఇట్టివారు బంధువులకయినను మేలొనర్పరు. కొంచెము మనోవికాసము కల్గినచో తనకు తన బంధువులకును మేలుచూచుకొందురు. మూడవతరగతి లోనికి వచ్చినవారు ఇరుగుపొరుగువారి మేలుకోరి సహాయము చేయుదురు. నాల్గవ తరగతివారు బాగుగ భావవికాసము కల్గినందున తనరాష్ట్రమంతయు శాంతి సౌఖ్యములకొఱకు ప్రయత్నింతురు. అయిదవతరగతిలోనికి వచ్చినవారు మనదేశమంతయు శాంతితో నుండుగాక యనుకొందురు. అప్పుడుగాని తనకు శాంతి లేనట్లు పరితపింతురు. పూర్ణవికాసము కల్గిన యోగి ప్రపంచమంతయు శాంతి సౌఖ్యములకొఱకై ప్రయత్నించుగాక యని అపరిమితముగు ఆవేదనపడుదురు.

శి: ఇటువంటి విశాలభావమునుపొందుట చాల అసాధ్యమని తోచుచున్నది. వివరముగ బోధింపుడు.

గు: శ్రద్ధగావినుము. శ్రద్ధలేనిచో బ్రహ్మవిద్య సూక్ష్మముగుటచే గ్రహించుట కసాధ్యముగనుండును. అజ్ఞానిగాని, జ్ఞానిగాని మనచే నొనర్పబడుకర్మ మనవరకే సమాప్తము కాజాలదు. కొన్ని కర్మలుమాత్రము తినుట, త్రాగుట, స్నానమాచరించుట మొదలగునవిమాత్రము మనతో నిల్చిపోవును. మిగిలినకర్మలు వృత్తిధర్మము మొదలగునవి. ఉ॥ రైతు పంట పండించుచున్నాడు. ఆపంట తానొక్కనికొఱకేకాదు. ఉపాధ్యాయుడు విద్యార్థులకు బోధించుచుండెను. ఆకర్మ తనతో సరిపోవుటలేదు. ఇదేవిధముగ

ప్రతియొక్కరు చేయుపనులతో పరస్పరసంబంధముండునని యూహించవలయును. కావున భగవత్సేవయను భావముతో కర్మచేసినచో కర్మయందలి మాలిన్యముతొలగి కర్మ పవిత్రమైనందున తన హృదయము, గృహము, గ్రామము, రాష్ట్రము, దేశము, ప్రపంచముకూడ శాంతినొందును. మానవుల మనస్సులయందే మలినమున్నది. పైన వ్రాయబడిన అనేక ఉపాయములచే మనంబును నిర్మలముగ నొనర్చుకొనుటకే అనేక యోగమార్గంబులుపదేశింపబడినవి. ఒక్కొక్క మహాయోగి గుహాలయందున్నను వారి జ్ఞాన ప్రదీప్తులు లోకమందెల్లెడల వ్యాపించి మహాపరిణామస్థితి కల్గుచుండును. తన సుఖముకొఱకెవరు గృహ, గ్రామ, రాష్ట్ర, దేశ, ప్రపంచ హానికారకమగు పనులను కేవల స్వలాభాపేక్షాపరులై చేయుచు, ఇతరుల పొరిగొల్పు మానవులే రాక్షసతరగతికి చెందినవారు.

శి: స్వామీ! ఉత్తముని లక్షణములను దెల్పుడు.

గు: ఎవ డసూయాపిశాచమునుండి విముక్తుడగునో వాడే ఉత్తముడు. దుర్గుణములన్నిటిలోను అసూయ బహు చెడ్డగుణము. సంతోషముచే అసూయను, సహనముచే క్రోధమును, ప్రేమచే ద్వేషమును జయించి కోరికలనుండి మనస్సును మరలించి భగవదభిముఖమునకు త్రిప్పవలయును. అటువంటివారల దృష్టి మారియుండును.

శి: స్వామీ! యోగికి పగలు రాత్రిగను, రాత్రి పగలుగను యుండునందురే అది ఎట్లు సంభవము ?

గు. బ్రహ్మవేత్తకు ప్రకృతి స్వప్నమువలెను, పరమాత్మ ప్రత్యక్షముగను అనుభవమునందుండుటచే యోగికి పరమాత్మ పగలనియు, ప్రకృతి రాత్రి యనగా స్వప్నమువలెనుండును. ఇదే అజ్ఞానికి పరమాత్మ రాత్రిగను, ప్రకృతి పగలుగ నుండును. అనగా వీనికి ప్రకృతి బాగుగ గోచరించును. పరమాత్మ ఏమాత్రము కాన

రాదు. కావున జ్ఞానాజ్ఞానులకు అనుభవము తారుమారుగ చెప్ప బడును.

శి: ప్రభూ! వినినకొలది ఇంకనూ వినవలయుననియే యున్నది.

గు: బ్రహ్మ అనంతము. కావున ఎంతవినినను ఎంత తెలిసికొనినను ఇంకను వినుటకుత్సాహముగనే యుండును. ఆ దేవదేవుని ప్రభావ మత్యద్భుతము. ఏకత్వమయిన బ్రహ్మానుభవమందే అనేక క్రొత్త అనుభవములు కల్గుచుండును. దీనికే నిత్యనూతనమను వాక్యము వర్తించును. రసవంతము ఉత్సాహములేని మొద్దుబారిన జడ వేదాంతుల వాక్యములెట్లుండుననగా సర్వము మాకే తెలియునను కొనుచు, మాటలుమాత్రము చెప్పుచు చెప్పినంత స్వవిషయము వచ్చుసరికి చేయక ఊరక చెప్పువారే జడవేదాంతులు. ఎవరైతే అనుకొనునది, చెప్పెడిది, ఆచరించునది ఒకటిగనే అనుష్ఠించుచు, సదా ఆత్మపరీక్షకులగుచు తమకు లభింపవలసినది లభించినచో తృప్తులగుచు, ఉదారులగు, విశాలదృష్టిగలిగి విశ్వమంతయు విశ్వేశ్వరరూపముగను, విశ్వమే తమ కుటుంబముగ హృదయాను భవముకలవారే స్వార్థరహితయధార్థభగవద్భక్తులు.

శి: స్వార్థపరత్వమునుగూర్చి బోధింపుడు.

గు: మానవుని మనస్సున నేను, నాయొక్క, ఇంకను నావారిసుఖమును గురించియే ఆలోచనయుండును. అనగా నేను, నా అను గూడు తయారగును. ఆభావముతప్ప వారికితర ఆలోచనయే యుండదు. చివరకు తపస్సు, వ్రతములు, పూజ, జపధ్యానాదులన్నియు ఈ నేను, నా అనుగూటివరకే చెందిపోవుచున్నవి. ఈ నేను, నా అను వలను జ్ఞానఖడ్గముచే నరికినచో మన ఆలోచనలు పనులు మాటలు అన్నియు ఇదివరలో తెల్పినట్లు మిక్కిలి ఉదారముగ నుండును. ఆస్థితి కేవలము నిరామయమగు ఆకాశమువలె ఖాళీగాయుండును. ఇదియే ఉత్తమస్థితి.

శి: స్వామీ! మోక్షమన నేమి?

గు: ఇదివరలో తెల్పితిని. అయినను బాగుగ వినుము. మోక్షమన భగవనుభవజ్ఞప్తితో దేహమాత్రావలంబులై తాను సాధించి పొందదగినది, పొందితినను తృప్తితో ఇక సాధింపవలసినది లేనందున ఏమాత్రము వెలితిలేని నిండుహృదయముతో, ఏఆరంభము లేక ఏసమయమున మరణము ప్రాప్తించినను, చింతలేక ధీరత్వముగ నుండువారు మోక్షార్హులుగా తెలియుము. ఆత్మస్వాతంత్ర్యమే మోక్షము. ఆత్మస్వాతంత్ర్యమొందినవానిని ప్రకృతి బంధింప జాలదు. సామాన్యులనుమాత్రమే ప్రకృతిబంధించును. మోక్షము కూడ తానొక్కడే యనుభవించవలెననుభావ ముండకూడదు. తాను పొందినస్థితి ఆసక్తికలవారలకు బ్రహ్మవిద్యను బోధించుచుండుటయే మోక్షమును శాంతిని పొందినవానికి చేయదగినపని. సర్వజనులకు స్వధర్మాచరణము ఆవశ్యకర్తవ్యము.

శి: స్వధర్మమెట్టిదో బోధింపుడు.

గు: స్త్రీలకు పతిని సేవించుటయు, బిడ్డలను దైవరూపముగభావించి సేవచేయుచు వారిని ధర్మప్రవర్తకులుగచేయుట స్వధర్మము. ఇట్టి గృహసేవచేయుచు అదియే పరమేశ్వరసేవగాభావించుటయు,ఇంకను తనకు చేతనయినంతవరకు పరులకు మేలుచేయుటయు ఉత్తమము. కేవలము తాను స్వయముగ తెచ్చుకొనిన ప్రారబ్ధరూపముగు స్వధర్మమునువీడి యితరుల ధర్మమును స్వీకరించరాదు. స్వధర్మ మొనర్చుచు, భగవద్భక్తి, త్యాగము, పరోపకారము, సాధుసజ్జనులసేవద్వారా జ్ఞానార్జనము చేయుచు భగవదనుగ్రహమునకు పాత్రులు కావలయును. ఎవరేవంశమునపుట్టిన పుట్టుకతోనే వారికి ఆవంశధర్మము వర్తించును. ఆవంశమునకు ఆజాతికి ఋణపడి యుండినందుననే అస్థానమున జన్మించుట సంభవమయినదికదా! కావున వంశ, రాష్ట్ర, దేశ ఋణములు తీర్చుకొనునట్లు మానవుడు

పరియత్నింపవలయును. ఇంకను ఎవరు ఏవృత్తిలో ఉందురో ఆ వృత్తి తాలూకు బాధ్యత పూర్తిగా నిర్వహింపవలెను. అప్పుడే దేశముకూడ సౌభాగ్యవంతమగును. చూడుము ఉపాధ్యాయుడు కపటములేక బాగుగబోధించిననే విద్యార్థులు మంచి ప్రవీణులగుదురు. ఇట్లే అన్నివృత్తులవిడ గ్రహించవలెను. వృత్తులతాలూకు కర్మఫలముమాత్రము ఈశ్వరార్పణ మొనర్పవలెను. కావుననే గీతాచార్యుడు స్వధర్మమును పుష్పముతో పరమేశ్వరుని పూజించినవాడే తనకు మిక్కిలి ప్రియులని బోధించెను.

శి: స్వామీ! పరమేశ్వరుని అనుభవజ్ఞప్తితోనుండవలయునంటిరే దానిని గూర్చి ఎరింగింపుడు.

గు: నాయనా! నీవు ఉదయము మొదలు ఎన్నిరకముల పదార్థములను గాంచుచుంటివి. నీకు కాన్పించువస్తువులయు, కూరకాయలయు, ఫలములయు మరియు అనేకపదార్థములయు, నిర్మాణకౌశలమును గూర్చి యోచింపుము. ఇంత నేర్పరితనముగను, సొంపుగను ఎవరు నిర్మించిరి. ఎంతరుచికరముగనున్నవి! ఒకచెట్టుయొక్క ఒకఆకుకు మరియొక ఆకుకు నేపోలికయుండదే. ఏమీ ఈదేహమెంత చమత్కారముగ నిర్మింపబడినది. ఎన్నిరకముల ఓషధులు, ఎన్నిరకముల జంతువులు, మానవజాతిఅంతయు ఒకేరకమయినను ఆనవాలు గ్రహింపదగు కొంత తేడా కన్పించితీరును. చూడునీవున్నావు. నీకుతండ్రి, ఆయనకుతండ్రి, తండ్రికితండ్రి వెనుకకు ఆలోచించగా భగవంతునివద్దకే ఆలోచనచేరును. ఇదేమాదిరిగా ఈసమస్తవృక్షలతాదిపశుపక్షిక్రిమికీటుకాదు లన్నింటికి జవాబు. నీవీ విధముగ ఆలోచించిన ఎంతో ఆశ్చర్యమగ్నుడవగుదువు. ఫలరసాదులయందలి మాధుర్యమును చవిచూచి ఆహా ఈమాధుర్యమును వీనిలో నింపి జీవకోట్ల కెవడు దానముచేసియున్నాడని పరమేశ్వరుని గూర్చి యోచింపుము. నిర్మాణకర్త యొక్క దయాసామర్థ్యముల

కాశ్చర్యపడుచు ప్రకృతిపదార్థముల వాడుకొనుము. సృష్టిలోని పదార్థములకు, భార్యా, పుత్ర, మిత్ర, బంధువర్గములకు తాను దాసుడై పోక నియమముగ నుపయోగించుకొనవలయునుసుమా. చివరకు మన దేహమునుకూడ ఇంతే. మనప్రయోజనముకై దైవముచే ఇవ్వబడిన దివ్యమగు రథము ఇది. ఉత్తమకార్యములొనర్చుచు దీని ప్రయోజనమగు ఆత్మస్వాతంత్ర్యమును అశ్రద్ధలేక సాధించి పొందవలయును. విమర్శనాజ్ఞానము మానవునకే ఈయబడినది. మిగిలిన తిర్యగ్జాతులకు అట్టి అవకాశములేదు.

శి: మానవునకు పశువునకు గల తేడాను వివరముగ బోధింపుము.

గు: మానవునకు ఈపని చేయతగును, చేయకూడదు అను వివేచనాజ్ఞానము కలదు. పశువులకు మానవులకు ఆహారమునందు, నిద్రయందు, సుఖదుఃఖ, ఇష్టఅయిష్టము లన్నిటియందు సమానమే. వాటికికూడ జ్ఞానముకలదు. కాని వాటికవసరమగునంతటి తెలివి మాత్రమే యున్నది. కాని పాప పుణ్యములనియెడు, చేయతగిన చేయకూడనిపని యను వివేచనాసామర్థ్యము లేదు. అయితే అన్ని జీవుల పరిమాణ మొకటియే. ఏశరీరములందున్న జీవులకు దానిలోనే ఆలాగే ఉండిపోవలయునను అభిలాషయుండును. ప్రకృతితో మిక్కిలి తాదాత్మ్యభావ మున్నందున జడస్వభావము పొందుచున్నారు. ప్రకృతియొక్క మాయాజాలమును అనేకజన్మలలో ఛేదించుకున్న జీవులే పరమగమ్యమగు మోక్షమునుకూడ సాధించుచున్నారు.

శి: ప్రభూ! పరమాత్మ ఆకాశమువలె నుండునంటిరే మరొకవిధముగ బోధింపుడు.

గు: మనకన్నివైపుల గాలి, సముద్రముకలదు. ఇది కొంతవరకేకలదు. ఆకాశమింకను సూక్ష్మము గావున సర్వత్ర వ్యాపకముగ నున్నది. పరమాత్మ ఇంకను సూక్ష్మమగుటచే ఆకాశమునకుకూడ అవకాశమిచ్చుచున్నాడు. సర్వము పరమేశ్వరునియునికిచేతనేనిల్చియున్నది.

శి: స్వామీ! పరమాత్మ శూన్యుని యందురే. మీయభిప్రాయమేమి?

గు: శూన్యమనగా జీవప్రకృతుల లక్షణములు పరమాత్మకు లేవు. కాని సర్వసామర్థ్యములుండుటచే ఆ సామర్థ్యములచేతనే జగద్వ్యాపారములన్నియును జరుగుచున్నవిగా తెలియుము.

శి: బిడ్డల భావములెట్లుండునో ఎరిగింపుడు.

గు: చంటిబిడ్డల భావములలోనే పూర్వజన్మల తాలూకు వికారములన్నియు అణగియుండును. క్రమక్రమముగా శరీరాభివృద్ధి యగుకొలది మానసికముగానున్న సంస్కారములన్నియు వికాసమొందుచుండును. బిడ్డలకు ఎదుట గోచరించిన పదార్థములనే కావలయునందురు. తిరిగి వెంటనే మరచిపోవుదురు. యోగుల స్థితియు నిట్టిదియే. ప్రతివానితో తాత్కాలిక సంబంధమేగాని శాశ్వత అభిమానముండదు, మనస్సు ఆత్మలో లీనమగుటచే నిర్మలమయమగును. మనోమాలిన్యము తొలగినవారికి లోకమంతయు పవిత్రముగ గోచరించును. వారికెచ్చటను విరోధభావము తోపదు. ఎవరిమనస్సు ఎట్లుండునో ఇతరులగూర్చి అట్లే యోచింతురు. ఒరుల చెడుగులను గూర్చి చింతనచేయు మనస్సు తానే మలినమైపోవును. కావున అభ్యాసకులు సర్వులయందలి మంచిగుణములనే గణన చేయుచుండవలయును. అట్లొనర్చినచో తనమనస్సు నిర్మలమగును. తేనెటీగ పుష్పములనుండి మకరందము నెట్లు పానముచేయునో, ఈగ దుష్టపదార్థములపై వ్రాలి మలినము స్వీకరించునో గ్రహించి, మనము తేనెటీగవలె నగుటకే ప్రయత్నించవలెను.

శి: మహనీయుల దర్శనభాగ్యముచే కల్గు ప్రయోజన మెట్టిదో ఎఱింగింప వేడుచున్నాను.

గు: మహాత్ముల దర్శనము తీర్థయాత్రలకంటె గొప్ప ఫలమిచ్చును. చిరకాలసేవచేగాని తీర్థయాత్రలు పవిత్రమొనరింపవు. మహనీయులు తమ కరుణాకటాక్ష వీక్షణములచే పవిత్రుల నొనర్చినంతనే

మనోమాలిన్యములు తొలగి నిశ్చలత్వము చేకూరును. అసలు హృదయమున కపటముదూరమైనగాని మహాత్ముల ముఖారవిందము వైపు ధైర్యముగ చూడజాలరు. వారితో ధీరత్వముగ భాషింప జాలరు. మనలో పవిత్రభావము వృద్ధిచెందినకొలది మంచి ధైర్యము చేకూరును. ప్రతిజీవికి ఏదియో కొఱతయుండుటచేత మరలజన్మించి ఆకొఱతను పూర్తిచేసుకొనుటకు పాటుబడును. కాని బ్రహ్మవిద్య ననుష్టించి బ్రహ్మానుభవమున మునిగిపోయినవారికి ఎట్టికొఱతయు లేనందున ఇక ప్రయత్నించెడిది యుండదు. అట్టివారు ఏదేని కారణార్థ మవతరించినను, వారికి జన్మ, కర్మ యనుబంధముండదు. అటువంటివారు బాల్యమునుండియు వైరాగ్య, త్యాగ, సద్గుణులై కొంతవరకు లోకసేవ యొనర్చి, నిర్విచారముగ తిరిగి పోదురు. వారే ఆత్మస్వాతంత్ర్యము కలవారు. ఇతరుల కష్టములను తొల గించునిమిత్తము కొంత తాము అనుభవించి భక్తులకు తేలిక యొనర్తురు. ఆమహనీయుని యుదారత నెంతని వర్ణింపను. అది అనిర్వాచ్యము, ఊహాతీతమును అయి, పరమేశ్వరునితో పోల్చ బడినది. కావున చదువరులెల్లరును బ్రహ్మవిద్యామహిమను గమ నించి, త్వరితప్రయత్నముతో సాధించి దివ్యానుభూతినిపొంది లోక మున కాదర్శప్రాయులై ధన్యాత్ములగుదురుగాక యని వేడుచూ గురుశిష్యసంవాద రూపకమగు ఈగ్రంథమును ముగించుచున్నాను.

గురుశిష్యప్రబోధము ప్రథమభాగము సమాప్తము.

మంగళమ్ మహత్ శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతిః శాంతిః శాంతిః

---

రాయలముద్రణాలయము, తణుకు. మార్చి – 1958.